# పండ్రెండురాజులకథలు







సోమరాజు రామానుజరావుగారు

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ. (కృష్ణాజిల్లా)

1933



[వెల 0-12-0

# సతీ సక్కుబాయి

ఇది ఆంధ్రదేశప్రజానుల భాగ్యవశమున వెలువడిన యమూల్య నాటకమణి. యీ యపూర్వ నాటకపుష్పము దేశదేశముల సంతోష సువాసనల వెదజల్లుచున్నది. యీ నాటక కల్పవృక్షము ఆంధ్రజనుల యదృష్టదేవత ప్రసాదించిన పుణ్యఫలము. సక్కుబాయి నాటకము చేతియందున్న వారిపాపములు భస్మమైపోవుననుట నిస్సందేహము.

యీనాటకప్రదర్శనము యెవ్వరియింట నుండునో వారియింటికి యమదూతలురారు. ఈ నాటకరాజమునందలి పద్య మొక్కటి చదివినవారు స్వర్గలోకమందు దేవతలచే బాగడబడుచుందురు. సక్కుబాయి పతివ్రతామతల్లి, భగవంతునిచేత సతగారికి సేవచేయించిన గారడికత్తె- శ్రీకృష్ణుని సవతిగాజేసికొనిన నెరజాణ - పాండురంగని భార్యగాజేసి తన మగనికి సౌఖ్యమొసంగిన మంత్రవాదిని- భక్తిరస రసాయనము లోకములో వెదజల్లి, జనుల యజ్ఞానరోగమును రూపుమాపిన గొప్పవైద్యురాలు. అమాయకురాలు ననభక్తను సకలవిధముల సేవించిన పుణ్యాత్మురాలు- యమదూతవంటి యత్తగారిచేత కోటంటికములపడి, యామెను పాండురంగని భక్తురాలినిగా జేసిన తపస్విని.- ఇటువంటి నాటకరాజము నేటికి యాంధ్రదేశ మలంకరించినది. అనేకసులక్షణ మహానాటకములువ్రాసి కీర్తిగడించిన బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు యీనాటకరాజమును రచించినారు. ఇందలి పద్యములు అమృతపుగుళికలు, యిందలివాక్యములు మాణిక్యపుముక్కలు, యిందలి భావములు పటికబెల్లపు పలుకులు. ఇందలి అక్షరములు అక్షరములే. నేయేల! దీనిప్రశస్త్యమును చెప్పుటకు వేయినోళ్లుగల యాదిశేషుండు అవతరించవలసినదేగాని, మావంటి వారి కలవిగాదు. [illegible]. మించినపిమ్మట యోచించినలాభము లేదు. మహాలక్ష్మి ముంగిటకువచ్చి తొంగిచూచినట్లు ఈనాటకలక్ష్మి పుస్తకరూపమున సరస్వతీ బుక్కుడిపోను అలంకరించినది. రు 1-0-0

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,

[illegible] బెజవాడ.

శ్రీ

# పండ్రెండురాజుల కథలు,

గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావు.



ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ. (కృష్ణాజిల్లా)

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

రామకృష్ణ ప్రింటింగువర్క్సు, తెనాలి.

1933



[వెల 0-12-0

# విషయసూచిక

# పంద్రెండు రాజుల కథలు

## 1 కృష్ణార్జునుల యమునాతీర విహారకథ.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, నారాయణాషోడశకళాంశసంభూతుండును, జగన్నాటక సూత్రధారియు జగజ్జేగీయమానకోమలశ్యామలాకారుండును, యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి, నిష్ఠాగరిష్ఠుండును, స్థావరజంగమాద్యభికృబాహ్యాంతర్యామియు, యోగిజనహృన్మండలమండితాంతర్వర్తియుఁ త్రిమూర్త్యాత్మకదివ్యస్వరూపియు, భక్తజనాభయప్రదానశీలుండును, చిదానందవిగ్రహుండును, జ్ఞానప్రపూర్ణతేజోరాశియునగు శ్రీమన్నారాయణుండు, భూభారావతరణార్థమై శ్రీకృష్ణనామధారియై మానవయోని నుద్భవించి, భూలోకైకకైవల్యంబునాఁ బ్రసిద్ధంబైన ద్వారకాపురంబున సమస్తయాదవలోకచక్రవర్తియై లీలావినోదంబులం దేలియాడుచుండ, నొక్కదినంబున, తద్దేవదేవుని జననీజనకులగు దేవకీవసుదేవులు, కృష్ణవిలాసమందిరాభ్యంతరంబున కరుదెంచి, తద్దేవదేవునివలనను, అష్టమహిషీమండలమువలనను, నమస్కారాదిసన్మానములంబడసి సుఖాసీనులై యున్నంత- దేవకీదేవి దరహసితాననాబ్జయై నిజపుత్రరత్నముం దిలకించి, "కుమారా! కతిపయదినంబులకుఁబూర్వము కుంతీసుతమధ్యముండును, నీమేనమఱందియునగు పార్థుండు భూప్రదక్షిణమిషంబున రైవతకాద్రిసీమం గొన్నిదినంబులు సన్యాసివేషంబున, నివసించియుండుటయు- తత్పూజార్థమై నీయన్నయగు బలభద్రునిచే నియమితయైన నీచెలియలగు సుభద్రయుందు

చిత్తంబుహత్తించి, గాంధర్వవిధిం బరిణయంబాడి, యతిరహస్యంబుగ నాబాలంగొని, నిజనివాసంబున కరుగుటయు, నీకు సువేద్యంబులే యగుట నెంజేయుం బునరుక్తిగా వచింపంబనిలేదు. అన్యోన్యప్రణయ నిబద్ధమానసులును, మేనత్త మేనమామబిడ్డలును నగు, సుభద్రార్జునుల వివాహమునకు మనమందఱమును నామోదించి వారల సన్మానించుటయే కర్తవ్యంబని, నీతండ్రిగారును, మనకులవృద్ధులును నయితము నిర్ణయించియున్నవారు; కావున నీవు కతిపయసేనాసమేతుండవై — శుభవస్త్రాభరణాలంకారాదులంగొని యింద్రప్రస్థంబునకరిగి, చెల్లెలిని, మేనమఱందిని సన్మానించిరమ్ము. ఇదినీకవశ్యాచరణీయం" బని యాజ్ఞ నొసంగ నయ్యాదవకిశోరుండు నల్లెయని మాతృశాసనంబు నౌదల ధరించి, యింద్రప్రస్థంబున కరుగ నాయత్తుండయ్యె.

అనంతరము—భగవానుండగు శ్రీకృష్ణుండు, ధారాధరోపమానంబులగు, దివ్యస్యందనములతోడను, దిగ్దంతావళతుల్యంబులగు దంతావళంబులతోడను, నుచ్చైశ్శ్రవసముంబులగు తురంగంబులతోడను, గంధర్వకాంతాతిలకంబుల నపహసించు సుందరదాసీజనసహస్రంబుతోడను, నవరత్నఘటితామూల్యాభరణ చీని చీనాంబరంబులతోడను, విచిత్రసాలభంజికలతోడను, యనంతసుగంధద్రవ్యంబులతోడను, భేరీభాంకారాది మంగళవాద్యంబులతోడను, దివ్యస్యందనంబునొం డధిరోహించి, ద్వారకాపురంబునువదలి యింద్రప్రస్థ నగరాభిముఖుండై నిర్గమించె నంత నప్పురాంగనలు మత్తకాశినులు చిత్తజతూణీరాయత్తంబులగు చిత్తంబు లుత్తలపాటునొంద, చిత్తజమోహనుండగు నప్పురుషోత్తముని వియోగంబునకుందాళంజాలక, మగిడి యనతికాలంబున నాదేవదేవుని దివ్యదర్శనముం దమకుంగల్గించునిమిత్తము, పరమేశ్వరధ్యానంబుల నొనరింపసాగిరి.

అట్లుపయనంబైన మాధవుం డనతికాలంబున నింద్రప్రస్థంబునకుం జేరి, ముందుగాం దమరాకం బాండవ సహోదర పంచకంబున కెఱిం

గింప, నప్పాండుసుతాగ్రజుండగు యుధిష్ఠిరుండు నిజసహోదర చతుష్ట యంబుతోఁగదలి పురబహిఃప్రదేశంబుననే, కేశవునెదుర్కొని సన్మా నింప, నాగోపాలదేవుండు దర్మజునకు నమస్కరించి, భీముం గౌఁగిలిం చుకొని, పార్థుని నమస్కృతులనంది, కవల నాశీర్వదించి, యందఱి తోఁగలసి మహానందంబున సరససల్లాపంబులనాడుచుఁ బురప్రవేశం బొనరించెను. అంత యుధిష్ఠిరుండు, శ్రీకృష్ణునకు తదనుగమ్యమాను లగు పరిచార పరిచారికావర్గంబులకునుం దగిన విడుదులంజూపి, మార్గ శ్రాంతిని, వాసి సుఖోపవిష్టుండై యున్నపిదప నాముకుందునిఁగాంచి సాధువచనంబుల "నోపురుషోత్తమా! అజరుద్రసురేంద్రాదులకైన నలభ్యంబగు నీబాంధవంబు మముఁబోటి ప్రాకృతజనులకుఁ గల్గుట మాపురాకృత పుణ్యవిశేషంబ—దాని నట్లుండనిమ్ము—మహారాజాధి రాజులును, దివ్యర్షిచంద్రులును, బహువర్షంబుల యుష్మన్మందిరద్వా రంబునఁ బడిగాపులువడియుండినను లభింపఁబోని తద్దివ్యదర్శనభాగ్యం బయాచితంబుగ మాకు నేడులభించుటకెద్దియో విశేషకారణంబుండక పోదు తత్కారణంబెట్టిదియో దయతో నెఱింగింపవే?" యని పలుక, నాజగన్నాథుండు, తానరుదెంచిన కారణంబు నామూలచూడముగా నెఱింగించి, పాండవులకు వేర్వేఱుగాఁ దాఁ గొనివచ్చిన వస్త్రాభరణాదు లను సమర్పించి, రథగజతురగ సేనాసంచయంబును యుధిష్ఠిరుల కర్ప ణంబుఁజేసి, యదనంతరంబు, సుభద్రాపాంచాల్యాద్యవరోధజనంబుల యభ్యంతరమందిరంబులకరిగి, వారివారికి వేర్వేఱసారెలను, చీనిచీనాం బరాభరణాదులను పరిచారికాజనంబులను నొసంగి, సహోదరీమణులను శుభదృష్టి నాశీర్వదించి, ప్రత్యేకముగ సుభద్రకునీతులంగఱపి, వచ్చిన కార్యంబును సాకల్యంబుగ నెఱవేర్చుకొనిన పదంపడి, యుధిష్ఠిరాది పాండునందన ప్రార్థితుండై కొన్నిదినంబు లింద్రప్రస్థనగరంబున వసి యించెను.

తత్కాలంబునం దొక్కనాడు, ధనంజయుండు మధుసూదను నవలోకించి—"నారాయణా! షడృతువులందును, వసంతంబు సంతస ప్రదంబైనదిగా నొప్పారు. ఇది యట్టి మహానందదాయకంబగు వసంత కాలముగావున, మనమిరువురము నీఋతువునం గొన్ని దినంబులు, సుఖ ప్రదంబగు యమునాసైకతస్థలంబున విహరించి రాఁగుతూహలమయ్యెడు. నీకిదియభీష్టంబే?" యని సంప్రశ్నింప గోవిందుఁడందుల కనుమతింప, నామఱునాటిదినంబుననే యన్నరనారాయణు లిరువుఱును, సముచిత సన్నాహముతోఁగదలి, యమునాతీరంబున కరిగిరి.

తన్నదీతీరంబునఁ బటకుటీరంబుల నేర్పఱచుకొని యాబావమఱం దులు పగఁటివేళ, తత్ప్రదేశస్థ ప్రశస్తవనసౌందర్యంబును గని యానం దించుచు, పరిమళమిళిత మృదుపుష్పభరిత లతానికుంజంబుల, నుపవ సించుచు, తన్మధురపరిమళమిళితవాయువుల నాఘ్రాణించుచు సరసా లాపంబులతోడను, నిష్టలీలలతోడను, క్రీడావినోదంబులతోడనుఁ బ్రొద్దులుపుచ్చి, సాయంకాలమైనవెంటనే, పంచభక్ష్యాయుతంబగునో దనంబునుగుడిచి, యమునాసైకతస్థలంబులంజేరి, సంపూర్ణచంద్రికా ప్రకాశంబున, నుపవిష్టులై మనోహరతాంబూలచర్వణముంగావిం చుచు, మందమందశీతల పవమానంబులకు బ్రమోదమానమానసులై యిష్టగోష్ఠిఁగావించుచున్న సమయంబున శ్వేతవాహనుఁడు త్రివిక్రముం దిలకించి యిట్లనియె.

"మహానుభావా! యదునందన! పురుషోత్తమ! నినుబోటి మహాత్ముల సాన్నిధ్యభాగ్యంబుగల్గుట యనన్యదుర్లభంబు అట్టి యవ కాశంబు తన భాగ్యవశంబునఁ గల్గినయెడ సద్దాని వ్యర్థంబొనరించుకొనిన నరుండవివేకియగు. కావున, దివ్యచంద్రికా ప్రకాశంబువలనను, మనోజ్ఞమలయమారుతంబులవలనను నిర్మలంబైన నాహృదయంబిప్పుడు కొంత జ్ఞానమార్గంబునుగఱచి కృతార్థతనంద నభిలషించుచున్నయది; దేవమానవాదుల కెట్టిమార్గంబున పునర్జన్మరహితంబైన దివ్యమోక్ష

సామ్రాజ్యపదంబు లభింపఁగలదో దయతో నెఱిఁగించి ననుం గృతార్థునిఁగా నొనరింపవేఁడెద!"

ఇట్లు ప్రార్థించి ముకుళితకరకమలుండైన విజయునిఁగాంచి, త్రివిక్రముండు—"సవ్యసాచీ! నీవు కోఱిన సంప్రశ్నంబు నాహృదయంబున కత్యంతానందంబును ఘటింపఁజేసె—నీవు తొల్లి బదరికావనతాపసివగు నరుండవగుటంజేసియు తత్కాలంబున నీకుగల్గిన నారాయణఋషీంద్రుని సాహచర్యంబునంజేసియు, భగవదంశ నీయందుండుటంజేసియే నీకెట్టి ప్రశ్నంబొనరింపఁ జిత్తంబుగలిగెఁగాని, యన్యులకుఁ గలుగదు. నీవు ధన్యాత్ముండవు. విదేహంబగు కైవల్యమే మోక్షమనంబఱఁగు, అది తత్త్వకోవిదులగువారలకు మాత్రమే లభ్యంబగు పదార్థము. తొల్లి, భరద్వాజ, కశ్యపాత్రివసిష్ఠవామదేవగౌతమగార్గేయనారదకణ్వవిశ్వామిత్రవ్యాసవాల్మీకి, కపిలశుకశౌనకాది దివ్యచంద్రములును, ప్రహ్లాదాంబరీష, ధృవ, రుక్మాంగద జనకాది రాజర్షులును, భగవ భక్తిభరితులై వేదాంతరహస్యంబు నామూలంబుగా నెఱింగి బ్రహ్మజ్ఞానప్రాప్తి నొంది మోక్షముం గాంచిరి. బ్రహ్మజ్ఞానముచేతను వేదాంత పరిజ్ఞానమువలననే కాక, వేఱొండువిధంబున మోక్షంబునంద సాధ్యంబుగానేరదు. మంత్రతంత్రాదులును, షణ్మాత్రింబులును, సాకారధ్యానంబును, దారులోహశిలాద్యాకార సంపూజనంబును, త్రిగుణధ్యానమననాదులును మోక్షమార్గంబులని మూఢులు విశ్వసింతురేకాని ప్రాజ్ఞులు తలంపఁబోవరు. తత్త్వమస్యాది మహావాక్యంబుల నెఱింగి, నిరాకార బ్రహ్మంబగు నాత్మను ధ్యానించుచు, అర్చనాది సత్కారంబులను సాకారసద్గురుబ్రహ్మంబునకు గావించుచు జన్మసాఫల్యతనొందుటయే మోక్షముఁగాంచుట యని యెఱుంగుము." అని యెఱింగించిన సర్జునుండు కృష్ణునకు సాష్టాంగ నమస్కారంబొనరించి—"మహానుభావా! నాభాగ్యమూలంబున లభియించిన నీవే నాకు సద్గురుండవు. తమరిప్పు డొసతిచ్చిన వేదాంతరహస్యం బెన్నివిధంబులుగా గల్గి దేవ మాన

వాదులకు తరణోపాయమైయున్నదో క్రమంబుగ నెఱింగింప వేడెద!" నని యడుగ, కృష్ణుం డర్జునుం జూచి—

"యర్జునా! సావధానుండవై యాకర్ణింపుము. వేదాంత మార్గంబు ద్వాదశవిధంబై—సాంఖ్యసూత్ర, ఛాయాపురుష, నాదానంద, పంచముద్ర, తారకమంత్ర, సచ్చిదానంద, సాకార, నిరాకార, అమనస్క, దర్పణ, మెఱుక, అచలపరిపూర్ణ, నామంబులం బఱగుచున్నది. ఈ ద్వాదశమార్గంబుల నెఱింగినవాఁడు మోక్షంబునొందుటకు సందేహములేదు. కావున నిందలి ప్రథమోపాయంబగు, సాంఖ్యసూత్రంబును గుఱించిన పుణ్యకథ నొక్కదాని నెఱిఁగింెద—నాకర్ణింపు"మని యిట్లు చెప్పఁదొడంగెను.

---

# 2. జయసేనమహారాజుకథ

తొల్లి—మగధదేశంబును, ధర్మాత్ముండగు, విజయసేనుండను మహారాజు జనరంజకంబుగఁ బెక్కువర్షంబులు పరిపాలించెను. ఆవిజయసేనునకు జయసేనుండను నొక్క కుమారుండును, ఆతని సోదరుండగు ప్రతాపసేనునకు, వినయసేనుండను నొక్క కుమారుండునుఁ గలిగిరి. జయసేనుఁడు విజయసేనునకన్న నాల్గువత్సరంబులు పెద్దవాఁడగుటంజేసి, వినయసేనుం డగ్రజునియెడ వినయభక్తివాత్సల్య తత్పరత మెలంగుచు నతనితోఁగూడి యఖిల విద్యారహస్యంబులను గురుముఖంబున నేర్చుచు నాతని నహోరాత్రంబు లన్నపానీయ సమయంబులందు నయితే మేమఱక సదాఛాయనలె నంటియుండెను. ఇట్లుండఁ గొన్ని దివసంబులకు వార్ధక్యంపు పెంపున, నవ్విజయసేనుం డాసన్నమరణుండై—తన సహోదరుండగు ప్రతాపసేనునిఁ దనదరికిఁ జేరంజీరి, "సోదరా! నాకుఁ గాలము చెల్లిపోయినది. నేను శాశ్వతముగా నీ యిలాతలముంబాసి పోవుచున్నాను. ఇఁకమీఁదట, ప్రపంచజ్ఞాన రహితుండును, బాలుండును నగు, మన జయసేనునకు నాపిదప జనకుండవును రక్షకుండవును, నీవుదప్ప వేఱెవ్వఁడును లేరు. మన జయసేనుఁన కర్హప్రాయమువచ్చునంతదనుక రాజ్యంబును నీవ సంరక్షించి పిదప కుమారునకుఁ బైతృకంబగు రాజ్యంబు నొసంగుమని జయసేనునిఁ బినతండ్రి కప్పగించి దేహము చాలించెను. సహోదర నిర్యాణానంతరంబునఁ బ్రతాపసేనుని హృదయము విషసంకల్పసమాకీర్ణమై స్వపుత్రకుఁడగు వినయసేనుని రాజుగా నొనరించి, యేతంత్రంబుననైన జయసేనుని మడియింపఁదలఁచి యనేక, తంత్రోపాయంబుల నాతనిపైఁ బ్రయోగించుచు వచ్చినను, తత్తంత్రంబులెల్ల జయసేనునిఁ గంటికిఱెప్పనలె నిరంతరముఁ గాచుకొనియుండు స్వపుత్రుండగు వినయసేనునివలనఁ బటాపంచలుగా నొనరింపఁ బడుచుండుటకుఁ బ్రతాపసేనుఁడు తన మనంబున నత్యంతవ్యాకులతంగాంచి

కొన్నిదినంబులుజయసేనుని రాజ్యభ్రష్టునిగానొనరింప సంత్యసంకల్పంబు నొనరించి యొక్కనాడు జయసేనుం దనదఱికిఁబిలిచి "కుమారా! ఏ కారణంబుననో రాష్ట్రీయజనంబున కనేకులకు నీపైఁ గ్రోధముగల్గి యున్నది. వారిక్రోధంబు చల్లాఱునంతదనుక నీవే యన్యరాష్ట్రంబున నైనఁ దలఁదాచుకొని, దేశకాలస్థితు లనుకూలించిన పిదప నాయాజ్ఞ నంది మగుడ నిందురాఁదగును. నిన్నువిడుచుటయనిన, నాకును మిక్కిలి విచారంబు గల్గుచున్నయది. ఐనను నేనిందు నీకెట్టిసహాయము నుఁ జేయనేఱని వ్యగ్రుండనైతిని. ఇప్పట్టున నిట్లు నేనొనరింపనేని దుర్మార్గులగు రాష్ట్రీయజనులు నన్నును రాజ్యమునుఁగూడ మ్రింగివేయ సంకల్పించియున్నవారు; కావున నీవు రేపటిదినంబున నాయాజ్ఞను పాలింపుము. నీ నిర్గమనవృత్తాంతమును విజయసేనునకైన నెఱింగింప వల" దని శాసించినఁ బితృభక్తిపరాయణుండగు జయసేనుండు వినయ వినమితమస్తకుండై పితృన్యశాసనంబు నౌదలందాల్చి— "తండ్రీ! నాజనకుని యనంతరంబున, నీవేనాజనకుఁడవు. నీశాసనము నాకు శిరోధార్యము. మనము శ్రీరామచంద్రుఁడు జన్మించిన సూర్యవంశంబుననే జన్మించుటంజేసి యామహాత్ముని ప్రసక్తనమే మనకును మార్గదర్శంకంబై యున్నది. కావున నాతండ్రిల్లు పితృశాసనంబును నిర్వర్తించెనో నేనును, నట్లే నీశాసనంబునుఁ బాలింపనేనే ప్రవాసినై పోవుదును. నాకుసెలవి"మ్మని పలికినఁ బ్రతాపసేనుం డానందించెను. జయసేనుం డామఱునాటి వేఁగుజాముననే, చిరకాలావాసమగు స్వజన్మస్థానమును, తనకువిధేయుండై ప్రేమభాజనుండగు ముద్దుతమ్ముని విజయసేనునివదలి గమ్యస్థాన నిర్దేశంబొనరించుకొనకయే పురముంబాసి యొక మహారణ్య మార్గంబునఁబడి నిర్గమింపసాగెను. అట్లు మహాభయంకర నిబిడంబగు నరణ్యమార్గంబున నరుగుచు, నారాజకుమారుండు తన నెమ్మనంబున, "దైవమా! నేనెందరుగువాఁడ! మగధదేశాధీశ్వర నందనుండనని యెవ్వఱితో నేమనిచెప్పుకొందును! ఇట్లు నీవు రాష్ట్రత్యాగినై రాగతం

చేమియని ప్రశ్నించినవారల కెట్టి ప్రత్యుత్తరం బీయనేర్తును? జగ ద్రక్షకా! నాభావిజీవితము నీకృపారసముపై నాధారపడి యున్నయది. ఏరాజోత్తంసుని కడనైన సేవకవృత్తిని బ్రచ్ఛన్నకులగోత్ర నామధేయుం డనై మెలంగనున్నాను. ఇదియ నాసంకల్పము. దానిని నెఱవేఱఁజేయు భారమునీయదియే!" యని పరమేశ్వర ధ్యానంబుసేయుచు బహుతీరా రణ్యపర్వత నదీనదంబులను నిర్గమించి కట్టకడ కొక్క మహానగ రముం బొడఁగాంచి పెన్నిధింగన్న పేదచందంబున, నానందించుచు, నప్పుఱభేదన, బహిఃప్రాంతంబునఁగల, భవానీదేవ్యాలయముంజేరి తత్పరిసర సరోవరంబునఁ గడుపార జలంబులంగ్రోలి, ఫలవృక్షములం గాన్పించిన మధురఫలరసంబుల నారగించి క్షుత్పిపాసల నణంచుకొని, యాలయాంతరంబునకరిగి యద్దేవదేవికిం బ్రదక్షిణనమస్కారాదుల నొన రించి మార్గశ్రాంతి నణంచుకొనఁగోరి, యాలయముఖమంటపంబున శయనించెను. కొండొకనడి కాతని శ్రవణపుటంబుల కాందోళికా గమన సూచకంబగు వాహకుల యోంకారనినాదంబు వినంబడుటయు, నించుక తలయెత్తి మార్గంబున వీక్షింప నల్లంతదూరంబున, వింశతిపరి చారికా పరివేష్టితంబగు నొక్క యాందోళిక, దేవాలయాభిముఖంబుగ నరుదెంచుట గాన్పించెను. అంత నయ్యవనీధవనందనుం డాత్మగతం బున, "సయ్యారే! ఈ యాందోళిక యీ దేవాలయంబునకే వచ్చు చున్నయది. వైఖరిం బరికింప నెవ్వరో రాజకీయాంతఃపురాంగనామ ణులు దేవీపూజార్థమై యరుదెంచుచున్నట్లు తోఁచెడును. యువకుండ నగు నేనిందుగాన్పించుట కర్జంబుగాదు. ఇందెందేని దాగియుండెద!" నని తలంచి యందొక్క గుప్తప్రదేశంబుననిలచియుండి, తదంగనామణు ల వ్యవహారముం గమనించుచుండెను. ఏతదాందోళిక యాలయంబున కరుదెంచినపిదప, నప్పరిచారికలాందోళికాచ్ఛాదితంబగు రత్నఖచితపటం బు నించుక తొలఁగించి "భర్తృదారికా మణిమంజరీ! వెలికిరావచ్చునని పలుక, దేదీప్యమాన ప్రభాసౌందర్య విభాసురాంగియగు నొక్క

బాలాలలామము, మందగమనంబున వెలికరుదెంచి, పరిచారికాజనంబు కేలూతలొసంగ, దేవీసాన్నిధ్యంబునఁ దాఁదెచ్చిన పూజాద్రవ్య ఫలాదికోపహారంబులనుంచి ధూపదీపనైవేద్య పూజాదుల నబ్భవానీదేవి నర్చించి, నిమీలితలోచనయై బద్ధాంజలియై కొండొకతడవు మానసధ్యానంబుగావించి, మగిడి సఖీజనంబులతోఁగలసి, యాలయంబువెల్వడి యాందోళికారూఢయై పట్టణాభిముఖంబుగ నరిగెను. గుప్తప్రదేశంబున నిలచి యక్కాంతాజనం బొనరించిన కృత్యంబులనెల్లం దిలకించుచుండిన జయసేనుండు మహాద్భుత చేతస్కుండై — "ఓహోహో! ఈసుందరాంగి యెవ్వతెయైయుండును? ఇదియొకవేళ మానవకాంతగాక దేవకాంతయై యుండునా? కాను. కాదు— దేవకాంత లనిమిష లని విందుముగదా! అట్టిలక్షణంబీ నారీతిలకము నెడంగానమే!— ఇది విద్యుల్లతకాఁబోలును; విద్యుల్లతయైనచో నిలుకడయుండదుగదా! కాక యిది చంద్రబింబమేమో! చంద్రబింబమునం గళంకముండుఁగదా! ఈబాలికయందు కళంకమెక్కడిది? కావున నిదియొక రాజపుత్రికయగుటయే నిక్కము. ఇది యేరాజ్యమో! ఏపట్టణమో- నేనెఱుంగనైతి. ఈమె యొకవేళ యీదేశాధీశ్వరుని తనయకాఁగూడదా! ఔను. అందుల కేసందియంబునులేదు. ఈమె యీదేశపు రాజకుమారితయే! క్షణమాత్రంబున నీయన్నులమిన్న నన్ను చిత్తజుని నారాచంబుల భారింబడనైచిచనియె. నేని దుస్సహంబగు మదనతాపంబు నెట్లు సైరింతును! యేదియెటులున్నను తొలుదొలుత నిది యేరాజ్యమో కనుంగొనవలయు ననితలంచి, యాలయంబునువదలి పురప్రవేశం బొనరించి యదిమత్స్యదేశంబనియు, నబ్బాలిక మత్స్యదేశాధీశుని నందనయనియుఁ బురజనుల వలననెఱింగి, తన మనంబున, "తొల్లి మత్స్యదేశాధీశున కొకానొక రాజన్యునితోఁ గలిగిన ప్రచండసంగరంబున మజ్జనకుం డీరాజునకు సహాయం బొనరించుటయేగాక యాతని ప్రాణంబులను నయితము రక్షించెననియును తత్కారణంబు నీరాజు మాకుటుంబమున కత్యంత

మిత్రుండనియు, జెప్పగావిందు. దయార్ద్రహృదయుండును మాకవశ్యము మాననీయ బంధుసమానుండును నగు నీధరాధినాథుని పొంతనే కొన్ని దినంబు లజ్ఞాతకులశీల నామధేయుండనై మెలంగెద! అనల నా యెడల నాభవానీదేవి కరుణంజూపునెడల నిక్కన్యకారత్నంపుపాణినిం గూడ గ్రహింప గల్గుదునేమో!" యని యేమేమియో వెఱ్ఱియోచనలు సేయుచు మఱలం దనలో— "అయ్యయ్యో! నేనెంత వెఱ్ఱివాఁడను. పితృ మాతృవిహీనుండనై రాజ్యభ్రష్టుండనై యున్న నాకెట్టి పేరాసలు గల్గుచున్నయవి. దురదృష్టశాలినగు నాకీకన్యకామణిం జేపట్టఁగల మహాభాగ్యంబబ్బునే! అట్టి దురాశం బరిత్యజించి యీరాజేంద్రు నోలగంబున భటమాత్రుండనై దినంబులం బుచ్చెదఁగాక!" యని చిత్తమును స్థిరపఱచుకొని, రాజప్రసాదద్వారముం జేరి తనరాకను భట మూలంబున నాస్థానంబునకుం గబురంపెను, అనతికాలంబుననే, తద్భటుండరుదెంచి- జయసేనుంజూచి, యోమానవోత్తమా! ప్రస్తుతంబీ దేశాధీశ్వరుం డిందులేఁడు; వంగదేశాధీశ్వరునిపై దాడివెడలియున్న వాఁడు. ఐనను మంత్రిసత్తములుగలరు. దర్శనంబునకు ముదల యొసంగిరి. నీ వాస్థానంబున కరుగవచ్చు."నని పలికెను. ఆపలుకుల నాలకించి యాశాభంగమునొందియు మంత్రినైన సందర్శించినఁ గొంతఫలంబుగల్గునేమో యను నతిసూక్ష్మంబగు నాశాబంధము ముందునకీడ్వ, నాస్థానమునకరిగి ప్రెగ్గడను డగ్గఱి నమస్కరించి మోసల నంజలిబద్ధుఁడై నిలువ వినయంధరనాముండగు నమ్మంత్రి యాతని రూపలావణ్య ముఖగాంభీర్యాదులం దిలకించి విస్మయచేతస్కుఁడై యాతండొక మహాకులీనుండు గాని సామాన్యుండుగాడని తలంచి, నీయాశయంబేల నిటకేలవచ్చితివి నీవెవ్వండవని యడుగ జయసేనుండు—"సచివోత్తమా! నాది మగధ రాజ్యంబునకుఁ బ్రధాన నగరంబగు నుజ్జయినీపురంబు; నాపేరు మణిమంతుఁడు. నేనత్యంత దరిద్రుండనగుటఁ దమయాశ్రయంబున నెద్దియేని భటోద్యోగముం గాంక్షించి వచ్చితి;" నావుడు వినయంధరుండు—

"మణిమంతా! నీకోరిక యత్యల్పంబే యయ్యును దానిందీర్ప నేనశక్తుండ
నగుటం జింతిల్లెద; ప్రస్తుతము మాకును వంగదేశీయులకు మహాయుద్ధంబు
జఱుగుచున్నయది. యుద్ధసమయంబుల నూతనోద్యోగంబుల నెవ్వఱికిఁ
గానియొసంగుట మా నియమంబుగాదు; యుద్ధానంతరంబునఁ గాన్పింతు
వేని నిన్నొక సైనికునిగాఁ జేర్చుకొందు" మని పలికెను.

జయసేనుండట నాశాభంగంబునొంది యప్పురిం బాసి, మత్స్య
దేశాధీశుని తనయ యగు, మణిమంజరియందే హత్తుకొనిన చిత్తంబుతో
నున్మాదుని భాతినొక మహారణ్యంబునంబడిపోవుచు, దనలోఁ దా
నేమియో గొణుగుకొనుచుండెను. తత్సమీపంబుననేగల, మతంగమహా
మున్యాశ్రమమునుండి తచ్ఛిష్యుఁడగు పతంజలి యను బ్రహ్మచారి కుశా
దుల సంగ్రహింప నందందుఁ దిరుగుచు, నున్మత్తప్రాయుఁడై పలువ
రించుచు మార్గంబుగానక సరుదెంచుచున్న జయసేనుం గాంచి, యాతఁ
డొక వెఱ్ఱివాఁడై యుండునని తలంచి యాతనింగొని చని నిజగురు సన్ని
ధానంబున నిలిపెను. ఆ మతంగమహర్షియు జయసేనుని సౌందర్యాది
రూపసంపదల కాశ్చర్యపడి, యాతనివలన నాతని నిజచరిత్రంబెల్ల నెఱింగి
మిగుల జాలినంది, "యోవత్సా! నీవెంత వెఱ్ఱివాఁడవు! సమస్తవిద్యల
నామూలాగ్రంబుగానెఱింగియు, నొకబాలికంగాంచి యమితహేయమైన
యద్దాని ముట్టుకొంపనాసించి యిట్లున్మత్తుండవైతివిగా! మలమూత్ర
దుర్గంధభరితంబగు యోనియందుగల్గు తాత్కాలిక సుఖంబునాసించి
శాశ్వతంబైన పుణ్యపదంబును కాలందన్నుకొను వెంగలి, నీకన్న నెవ్వఁ
డైన నుండునా? నీవిభ్రాంతిని విసర్జించి, కొంతకాలము నా సన్నిధిని,
నిలచి, యీ చర్మశల్యాది హేయవస్తుభరితంబగు శరీరముయొక్క
యుత్పత్తి తెఱంగంతయు నాలకించి, యన్యజనదుస్సాధ్యంబులగు సమస్త
శస్త్రాస్త్ర మంత్రరహస్యంబులం గఱచి మఱిపో"మ్మని యానతీయ,
జయసేనుం డత్యంతానందభరితుండై యమ్మునికి సాష్టాంగ నమస్కా
రంబుల నొనరించి, "మహాత్మా! నేను ధన్యుడనైతిని. యుష్మద్దర్శ

నంబువలననే ప్రచండవాతాహతింజల్లాచెదరై పోవు మేఘంబుకరణి నా భ్రాంతి నగముతొలంగ — నాకు జ్ఞానోపదేశంబొనరింపవే!" యని ప్రార్థింప నమ్మతంగ మహాముని జయసేనునకు సాంఖ్యసూత్రంబు నుపదేశించెను. జయసేనుండును, ధన్యుండనైతినని యుప్పొంగుచుఁ గతిపయదినంబులా మునిశ్రేష్ఠున కత్యంత భక్తితత్పరుండై శుశ్రూషలంగావించి యొకానొక దివసంబున, నమ్మతంగ ముని ప్రమోదమానమానసుండై యున్నతరి నామహాత్ముని పాదంబులనొత్తుచు, "ఓమహాత్మా! మీరుబోధించిన శస్త్రాస్త్రమహిమంబు లసాధ్యంబులయ్యును, నుపయోగంబులేమింజేసి. బూదింబోసిన పన్నీటికరణి వ్యర్థంబులగుచున్నయవి. మత్పితృమిత్రుండగు, మత్స్యదేశాధీశ్వరుండిప్పుడు వంగదేశంబునఁ దన శత్రువులతో రణంబొనరించుచున్నవాఁడు; తమ యాజ్ఞయగునేని, నేనును తద్రణంబున కరిగి, తమరు నేర్పిన విద్యాకౌశలము బ్రదర్శించి సార్థకంబొనరించెద" నని ప్రార్థింప నమహాత్ముని ప్రమోదమానమానసుండై "వత్సా నీకు శుభంబగుగాక!" యని దీవించిపంపెను.

మతంగ మహర్షినివీడ్కొనిచనిన జయసేనమహారాజు కొలది దినంబులకు వంగదేశముఁజేరి, మధ్యదేశాధిపతియగు ఋతుధ్వజునకును, వంగదేశాధిపతియగు సునంగసేనునకును ప్రవర్తిల్లు మహాసంగ్రామంబుం గాంచి, దేహముప్పొంగ, అనాహూయమానంబుగ మత్స్యదేశసైన్యంబులంజేరి, మునిని మనంబునందలంచుకొని తన్ముని దత్తంబులగు నపూర్వ శర సహస్రంబునకు నమస్కరించి సమంత్రకంబుగవదలిన నస్త్రాణంబులు జాజ్వల్యమానంబులై భూనభోంతరాళంబుల భస్మీపటలంబొనరించు మాడ్కి మహాట్టహాసంబొనరించుచు వంగరాజన్యవతాకినుల నామావశేషంబొనరించుటంగాంచి, ఋతుధ్వజుండబ్బురంపడి, యీయనాహూయమానంబగు సహాయంబెవ్వరిదోకో యని విచారించి యెట్టకేలకు జయసేనుఁగనుంగొని, "మహాత్మా! నీవెవ్వండవు; నిర్నిమిత్తంబుగ నిమ్మహాప్రమాదసమయంబున నిటకరుదెంచి నాకు సహాయంబొనర్పఁగతంబేమని

ప్రశ్నింప, జయసేనుండు వినమితాంజలియై— "రాజేంద్రా! నేనొక నిరుపేదను. నన్ను మణిమంతుడందురు. నాది యుజ్జయినీనగరము; పేదఱికంబున జీవనోపాధికై యుష్మద్రాజ్యంబునకఱుగ నట సచివశేఖరుండు నూతనుండ నగుట నన్నొలగంబునందుంచుకొన ననుమానించెను. అంతట గత్యంతరంబుఁగానక నాకున్నై నే నిటకరుదెంచి తమయాజ్ఞనందకయే రణంబునఁ బ్రాణానినందులకు మన్నింపవేడెద"నని పలికెను. ఆపలుకులువిని ఋతుధ్వజుండాశ్చర్యమునంది "యోహో! సజ్జనవరేణ్యా! అపజయశంకాసంకులితస్వాంతులమైన మాకుసహాయమైనదటుండ నిన్ను మన్నింపనలయునా! నీవు పరమాత్రుండవుగావు. నీవు నాయోలగముంగోరివచ్చుట నన్నుధన్యుంజేయుటకుఁగాదే! నాసేనలకధినాధుండవైయుండుమని నియమించెను— ఇది యిట్లుండ నటఁబ్రతాపసేనుండు, జయసేనునిపోఁబడింగానక యాతని నెట్లయిన సంహరించినఁగాని రాజ్యము సం దనకుఁగల కంటకముతొలంగదని మరాలోచనంబొనరించి గూఢచారులచే మణిమంతుని వృత్తాంతంబునెఱింగి, యతండేజయసేనుండని యనుమానించి వంగదేశాధిపతితోఁ దనకుఁగల పూర్వమైత్రిం బురస్కరించుకొని ప్రచండసేనలతోఁగలసి వంగదేశప్రభుపక్షంబున ఋతుధ్వజునిపై కెత్తివచ్చెను. ప్రతాపసేనునిరాకడంగాంచి, జయసేనుండును రణంబునకాయత్తుండై, సేనలనుమాత్రమే సంహరింపవలయుఁగాని, ప్రతాపసేనునకుఁ బ్రాణాపాయముంగల్గింపవలదని స్వసైనికులకానతియిడి, ప్రచండసంగరంబాచరించి మగధరాజసేనలంబరాభవించి ఋతుధ్వజునకు విజయముంజేకూర్చి, తద్రణంబునఁ బ్రతాపసేనుండు సైనికులచే బంధింపఁబడ, ఋతుధ్వజుండాతని గారాగారంబుననుంచెను. పితృభక్తిపరాయణుండగు జయసేనుండు పితృవ్యునకుంగల్గిన పరాభవముంగని సహింపఁజాలక, యానాటి నడురేయి, చద్మవేషముందాల్చి పితృవ్యబంధితకారాగారంబున కరిగి, యటఁగాపుండిన భటునిఁ గార్యాంతరమున నెటకే నంపివేసి, తలుపులందెఱచుకొని, పితృవ్యుని చెంగటికేగి నిలిచెను.

ప్రతాపసేనుఁడు సోదరపుత్రుని గుఱితించి, యదేసమయంబని కరవాలం బున నాతనిం దెగటార్పనెంచి, బలంబుగ నాతనిశిరంబునఁ గత్తిని గుఱి చూచి విసరెను. భగవత్కృపచే నాయాఘాతంబు జయసేనుని శిరం బునకుఁ దగులక భుజముపైఁదగుల రక్తప్రవాహంబు గాఁజొచ్చి నను జయసేనుండద్దానిని శాంతముసనహించి, "తండ్రీ! నేనిందు సేనా నినై యున్నకారణమున విధిలేక మనసేనలతోడనే కలహింపవలసి వచ్చెను క్షమింపుము; నీవుశత్రువులచే బంధింపఁబడుట మనకులంబున కపకీర్తి కరంబగును కావున నిన్ను నేను విడిపింపవచ్చితిని. ఈయంగుళీ యంబును సాంకేతికంబుగాఁ జూపినచో భటులెవ్వలును నిన్నాటంక పఱుపరు. పురబాహిరంబున నీకొఱకొక సన్నద్ధాశ్వంబు నుంచితిని. దాని నారోహించి మనపురంబున కరుగుము. నీకు మారుగ నేనిందుండె దను. నాకులశీలనామంబుల నిందు నేను బహిరంగపఱుపలేదు. గావున నీరాజు నా కుఱిశిక్షనువిధించినను కులమున కప్రతిష్ఠరాఁజాలదు." అని పలికి యంగుళీయంబు నొసంగినంతనే మహాసహానశీలంబులును, త్యాగసహితంబులును నగు సక్కుమారుని పలుకులకుఁ బ్రతాపసేనుని హృదయంబునఁగల యీర్ష్యానలంబెల్ల నశించి, మహావిజ్ఞానకాంతి యద్భుతంబుగ నుద్భూతంబయ్యెను. అంతట నాతఁడటనుండి పలాయి తుండగుట కంగీకరింపక, నాతనితోఁ గొంతదడవు వివాదంబునల్పియు జయసేనప్రోద్బలంబున వెడలిపోయెను. మార్గంబునంగల భటుల కాతఁడు కుమారదత్తాంగుళీయముంజూపినంతనే—భటులు నిరాటంకం బుగ వదలుటయేకాక, రణంబున నాతని ప్రాణంబుల కపాయము రాకుండ జయసేను డొసఁగించిన శాసనంబునుసయితమాలకించి యట్టి సద్గుణరత్నంబగు కుమారరత్నముం జంపఁదలంచిన నేనెంతపాపాత్ముం డనని తలఁగొట్టుకొని, విలపింపఁదొడంగెను. పదంపడి తద్రాత్రం బున రాజభటులు కారాగృహంబున కరుదెంచి, ప్రతాపసేనుండు పలాయితుండగుటయు, జయసేనుండు క్షతగాత్రుఁడై యుంటయుం

దిలకించి, ప్రతాపసేనుఁడే జయసేనుని నఱకి పాఱిపోయెనని ఋతుధ్వజున కెఱింగించిరి. మఱునాఁడు ఋతుధ్వజుఁడు, పేరోలగంబుండి, రక్తసిక్తాంగుఁడైన జయసేను నందురప్పించి గతరాత్రంబున నేమి ఘటిల్లెనని ప్రశ్నింప, నాతండు తానుద్దేశపూర్వకంబుగ, ప్రతాపసేనుని విడిచితిననియును తన్నిమిత్తమై విధింపఁబడనున్న యుఱిశిక్షకైన సంసిద్ధుండ ననియును వచించెను. ఋతుధ్వజుండదివిని విస్మితుండై జయసేనుఁడు తనకొనరించిన యుపకారములం దలంచి శిక్షింప బుద్ధిరామిం జేసి, నీవాతని నేలవదలితివి; ఎట్టి ఘోరశిక్షకైన నేలఁబాల్పడితివని యెన్నివిధంబుల నడిగినను మాఱుపల్కఁడయ్యె. తుదకు విధిలేక రాజశాసనప్రకారం బాతని కుఱిశిక్ష నాజ్ఞాపించెను. భటులు నిర్భయానంద చేతస్కుండై యున్న మణిమంతుం గొనిపోవ సంసిద్ధులై యున్నతఱిఁ దత్సభామధ్యమునం దెటనుండియో—వికృతాకారుండగు నొక్కపురుషుండు వెడలివచ్చి, "రాజా! చాలుచాలు; నీ విశ్వాసబుద్ధి నేఁడుగదా తెలిసెను! నీ కనేకోపకృతుల నొనర్చి విజయసంపాదకుఁడై యున్న యీ బాలవీరునా నీవు వధించెద" వని గంభీర భాషణంబులం బలికెను. ఆ పురుషుని ప్రతాపసేనునిగా నెఱింగి సభాసదులు వెఱఁగందఁ జూచుచుండ, నాతఁడు, "రాజా! ఈబాలు నెవ్వనిఁగాఁ దలంచితివి. ఇతండు నీ పూర్వమిత్రుండును, మగధదేశాధీశ్వరుండును నగు విజయసేనుని కుమారుండగు జయసేనుండు. నాకారణంబున రాష్ట్రత్యాగియై యిట్లజ్ఞాతవాసంబొనర్పఁ బాల్పడియున్నాఁడు. ఈ కుమారశ్రేష్ఠుని, శ్రేష్ఠమానసంబు నెఱుంగక యజ్ఞానినై—చంపదలంచి యీయెడకు సంగరమిషంబున నరుదెంచి మీచే బంధింపఁబడితిని. ఈ కుమారుండు నాయవమానమునుగని యోర్వఁజాలక, నన్ను విడిపింపఁ గారాగారంబున కరుదెంచి యందుసహితము నాచే క్షతగాత్రుండుగా నొనర్పఁబడియెను. ఇట్టికుమారుం జంపఁదలఁచిన పాపిని నేనింక జీవించినఁ బ్రయోజనము గలుగ" దని పలికి తనచేతనున్న కటారితోఁ

బోవుచుకొనఁబోవ జయసేనుం డాతని కరముంబట్టి నిలిపి, "తండ్రీ! నీకింత సాహసము చెల్లునే! నీవు మరణించినచో తండ్రిలేని నాకు దిక్కెవ్వ" రని కన్నీరు వెట్టుకొనియెను. తనమిత్రుఁడగు విజయసేనుని సమూరునిగా మరియుం తెలిసెంగి, ఋతుధ్వజుండు మహానందముతోవచ్చి యాతనిం గౌగలించుకొని, జయసేన ప్రార్థితుండై ప్రతాపసేనుని క్షమించెను. తత్సమయంబున కటకుభగవానుండగు మతంగమహర్షి యరుదెంచి—సర్వజన సంపూజితుండై యుచితాసనంబు నలంకరించి "యోఋతుధ్వజా! ఈ జయసేనుఁడు పుణ్యాత్ముండు. నా శిష్యుఁడై నావలన సాంఖ్యసూత్రంబు నెఱింగిన పవిత్రుఁడు. ఇతఁడు నీపుత్రికయగు మణిమంజరింగామించియున్నవాఁడు. కావున నితని నీ యల్లునిగా నొనర్చుకొ"మ్మని పలుక నాతడు "మహాత్మా! నాకింతకన్న ధన్యతగలదే!" యని మహానందముతో నామోదించెను. తదనంతరము మతంగమహర్షియే వంగదేశ మత్స్యదేశంబులకు, సమాధానంబొనర్చి, తద్దేశాధీశులను మిత్రులుగా నొనరించి, వంగదేశాధిపతి పుత్రికయగు, గుణమంజరిని, ప్రతాపసేనపుత్రుఁడగు వినయసేనునకిచ్చి యుద్వాహం బొనరింప నిశ్చయించెను. మణిమంజరీ జయసేనులకును, గుణమంజరీ వినయసేనులకును మునిసన్నిధానమున మహావైభవముతో కల్యాణములు గావింపఁబడెను. కొడుకులు రాజ్యముం బాలించుచుండ ప్రతాపసేనుఁడు తన జీవితశేషమును మతంగాశ్రమంబున వానప్రస్థుఁడై గడపెను.

---

రెండవరాత్రి కథ.

మఱునటి దినంబున నయితము కృష్ణపార్థులిరువును సాయంకాలమే సుఖభోజనంబొనరించి యమునానైకతస్థలములంజేరి తాంబూల చర్వణంబొనరించు నవసరంబున, నర్జునుండు గోవిందుందిలకించి, "యో పురాణపురుషా! తాముచెప్పిన ద్వాదశమార్గంబులలో మొదటిదియగు, సాంఖ్యంబు నాకర్ణించి ధన్యుండనైతిని. నేటిరాత్రి ఛాయాపురుష లక్షణలక్షితంబగు మఱియొక పుణ్యచరిత్రము నానతీయవే" యని వేడిన నారాయణుండు మీనకేతనమహారాజు చరిత్రంబు నాకర్ణింపుమని యిట్లు చెప్పఁదొడంగెను.

# 3. మీనకేతనమహారాజుకథ.

శ్వేతవాహనా! తొల్లి—భోజమహారాజు ధారానగరముంబరి పాలించుకాలంబున, నప్పురంబున దేవశర్మాభిధానుండగు విప్రోత్తముం డొక్కఁడు విద్యుక్తవిప్రాచారపరతంత్రుఁడై సద్బ్రాహ్మణుండన ప్రసిద్ధికెక్కియుండియు నొక్కనాడు నిజజనకుని యాబ్దికంబునకై సర్వ శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణుని భోక్తగాఁగోరి మహాకవియగు కాళిదాసుని భోక్తగా నిమంత్రించెను. తత్కారణంబున కాళిదాసుని మహిమనెఱుంగని పామరజను లాతఁడు మత్స్యమాంసభోజియనియు, మధుపాయియనియు, వేశ్యాలోలుఁడనియు, సద్బ్రాహ్మణుండుగాఁడనియు, నట్టివానిని భోక్త గాఁబిలిచిన దేవశర్మ కులభ్రష్టుఁడయ్యెననియు నిందించి, వెలివేసిరి. అప్పటికి దేవశర్మకు, సుమతి, ధీమతి యనునిర్వురు కుమారులును, సౌందర్యమున రతీదేవికెనయగు, ననసూయ యనుపుత్రికయుం గల్గి యుండిరి. కులంబున వెలివేయంబడిన కారణంబున, దేవశర్మయే పుత్రులకుం బుత్రికకును సమస్తవిద్యలనునేర్పి — ప్రవీణులంజేసెను. అనంతరము కొన్ని దినంబులకావల కాలవశంబున దేవశర్మ మృతి నొంద, నత్సతి యాతనితో సహగమనం బొనరించి పురంబున వెలి

వేయఁబడిన బిడ్డలను మువ్వురను దిక్కులేనిపక్షులనుగా విడిచిపోయిరి. మాతాపితృహీనులైనను మతిధీమతు లిర్వురును నన్యసహాయంబు నపేక్షింపక నెట్లో దినంబులుగడుపుచుండ ననసూయ దినదినప్రవర్ధమానయై కొన్నికాఱు మెఱుఁగు తెఱంగున నభినవయౌవనప్రాదుర్భావయై సహోదరులకు తీరనిమనోవ్యథం గలిగించెను. ధారానగర విప్రులు తాము వెలివేయుటే కాక, తామెఱింగినంతవఱకుఁ బ్రతియూరఁగల విప్రులకును దేవశర్మ చరిత్రముఁ బ్రకటపఱచి యనసూయ నేవిప్రకుమారుండును వివాహమొనర్చుకొనకుండఁ గట్టడచేసిరి. ఈ విధమైన సంకటంబునం బొగులుసహోదరుల విచారంబు నెఱింగిన యనసూయ "సోదరులారా! నన్నుఁదలంచి మీరు చింతింపవలదు. నాప్రారబ్ధకర్మమిట్లేయున్నచో నే నామరణాంత మవివాహితనై యుండ నేర్తును. మీకపకీర్తిఁదేను." అని పలుక, నామె మాటలను విని యేమియుఁ బలుకనేరక సోదరులు దుఃఖించిరి. అనసూయ తనకుఁ దోడుగా సుశీలయగు నొక వృద్ధదాసిం దోడుగానుంచుకొని, దినమునకొక్కమాఱు మాత్రము తెల్లవాఱుజాముననే తటాకంబున కరిగి జలముం గొనివచ్చి సోదరులకు పచనాదుల నొనరించుచు, సద్గ్రంథకాలక్షేపంబున దినంబులం బుచ్చుచు నొరుల కంటఁబడక దినంబులు గడుపుచుండెను. ఇట్టి సత్ప్రవర్తనము గల్గిన యనసూయపైఁ బురజనులెట్టి దుష్ప్రవాదంబు లిడుటకును నవకాశము గల్గకపోయెను. ఇట్లుండఁ గొన్నిదినంబుల కాబాలికకు గర్భోత్పత్తియగు చిహ్నంబులు పొడసూపఁ బరిచారికదానిం గనిపెట్టి, విస్మయమునంది యేకాంతంబున నక్కోమలిం బిలిచి "యమ్మాయీ! నీకు గర్భోత్పన్నమైయున్నయది. నీవు గృహంబువిడిచి యెందునుం జనినదానవు గావని నీకు ఛాయవలె వెంటనంటియుండు నేను బాగుగ నెఱుంగుదును. కాని యీస్థితికిఁ గారణమేమో నాకగోచరంబై యున్నది. నాకు వాస్తవంబు నెఱిఁగింపుము; భయము లే"దని పలుక నక్కుసుమకోమలిగుండెలు ఝల్లుమన, వెలవెలంబోవుచు, "నోసీ! దాసీ! నీపె

నానయిడివచింతు—నే నేపాపంబెఱుంగను. గర్భంబననేమి? అదియెట్లు గల్గును! నీవేమియో పల్కెదవుగాని, నాకొక్కటియుం దెలియ" దని పల్కి రోదనము సేయఁజొచ్చెను. దాసియు నిదమిద్ధమని నిర్ణయింపఁ జాలక, యూరకుండినఁ దనపైఁబడునని, సోదరులగు సుమతి, ధీమతులకు వేర్వేఱ నీవిశేషము నెఱిఁగించెను. అంత నాసోదరు లిరువుఱు నెవటి యంతటవారు తమతమ యాత్మగతంబుల "ఛీ! ఛీ! యౌవనమెంత చెడ్డది! అనసూయ పరపురుషునిఁ గంటఁజూడనిదగుట ప్రత్యక్షానుభవ విషయంబు. అట్లైన గర్భోత్పత్తియగుటకేమికారణము! నిప్పులేక పొగ రాజదుగదా! నాసోదరుఁడు యుక్తవయస్కయైన సోదరింగని కామపీడితుఁడై యకార్యంబొనరించెను. కాకున్న మఱియొకరెవ్వఱురాగలరు! కామపిశాచము సోదరియనియైనఁ దలంపనీయదు కాఁబోలును! ఈ యింట నుండుటకన్నఁ బాపకార్యంబింకొకటి" లేదని తలంచి, యొకఱు పాపంబొనరించిరని యింకొకఱుతలంచి "నీవిట్టిదుష్కార్యం బొనర్చితివి గాన నేను గృహత్యాగినై పోవుచుంటి"నని యిరువుఱును నేక కాలంబున రెండుచీట్లనువ్రాసి, యింటనుంచి వేర్వేఱు త్రోవలంబట్టిపోయిరి. మఱునాడనసూయ సోదరుల నిర్వుఱను గృహంబునంగానక, వారిలేఖలంగాంచి పెద్దపెట్టున శోకించుచు, నాత్మహత్యకుఁ దెగించెను. పరిచారిక యామెను సాహసమునుండి వారించి, "బిడ్డా! నీవు చాలా లివై యున్నావు; యిట్టియెడ నీవాత్మహత్య యొనరించితివేని, యాత్మహత్యాపాపమేగాక, భ్రూణహత్యాపాపంబునుంగల్గును. నీవెట్లు గర్భిణివైతివో చిత్రముగనున్నది. ఎద్దియేని కలఁగంటివేమో స్మృతికిఁ దెచ్చుకొను" మనియడుగ నాయెలనాగ పెద్దతడవు స్మృతికిఁ దెచ్చుకొని, "యానేదాసీ! కొన్నినెలలకుఁబూర్వము నాస్వప్నంబున నెవ్వఁడో రత్నకిరీటకేయూరహారధారియగు నొక దివ్యపురుషుండు గాన్పించి నాయురోజంబులనొత్తి కెమ్మోవిని మునిపంట నొక్కి యధరామృతంబాని చెక్కిలి ముద్దిడి, నాకమితానందముం

గూఢచేష్టల నేమేమియో కావించిపోయెను. ఇప్పుడు నీవడుగఁగా జ్ఞప్తికివచ్చిన"దని చెప్పఁగా నావృద్ధదాసి దరహసితాననయై— "అమ్మక చెల్లా! ఇన్నినాళ్లీవార్తను నాకెఱింగింపక నీవేలఁదాచితివమ్మా! వెఱ్ఱితల్లీ! దుఃఖింపకుము. నీకేమియుభయములేదు; ఒకానొకదివ్య పురుషుఁడు స్వప్నంబున నీతోసంగమించెను. నీకు మహాతేజస్వియగు సుపుత్రుఁడు జన్మింపఁగలఁడు—నీకేవిచారములే"దని యాశామృతముం బోయ నాబాలయప్పటికిఁ గొంతశాంతినందినను సహోదరవియోగము నకు నిరంతరము దుఃఖించుచుండునది. ఇట్లుండఁ గొన్నినాళ్ల కన సూయ ప్రసవించి దివ్యకాంతులతోఁ దేజరిల్లు నొక సుపుత్రుంగనియెను. ఆబాలునకు దాసియే మీనకేతుండను నామకరణంబొనరించి సాకుచు మాతృశోకమును నివారింపఁ బాటుపడుచుండెను. క్రమంబున నీవార్త పురమందెల్లవ్యాపింప బురజనుల నసూయను జారిణిగాఁ బరిగణించి బహిరంగముగ నిందించుచు, క్రేళ్లుపెట్టిచూడసాగిరి. అనసూయ తద్దూషణంబులన్నింటిని, కుమారునికొఱకై భరించుచు, నిజజనని నిష్ఠురవధనంబులతో నారేండ్లకాలము గడిపెను. తదనంతరము భుక్తికి గూడ జరుగక, ధారానగర నివాసంబు దుర్భరమగుటంజేసి, యట కతి దూరంబునంగల, యుత్కళదేశంబునందలి కటకనగరంబునంగల తన మాతామహుని గృహంబున కరుగసంకల్పించి, దాసికి గృహంబునప్ప గించి వేఁగుజామునం గుమారుని వెంటనిడుకొని ధారానగరముం బాసి చనదొడంగెను. ప్రకృతిసుకుమారులగు నమ్మాతాకుమారు లిరువు రును, నత్యంతప్రయాసంబున ననేకారణ్యంబుల నిర్గమించిచనుచు— కాళులు పొక్కులెక్క—నాతపక్షుత్పిపాసల కోర్వంజాలక మార్గంబున నొక్క విశాల వటచ్ఛాయను విశ్రమించిరి. అత్తరుణంబున, నన సూయ కత్యంత దుస్సహంబగు పిపాసయగుటయు, నయ్యమ కుమారుం బిలకించి, "నాయనా! దాహబాధచే నాప్రాణంబులు నిలుచునట్లులేదు. ఈ కాననంబున నెటనేని సరోవరంబొండుగలదేని యరసి తజ్జలంబులం

గొనివచ్చి నా దాహశాంతి యొనరింపు" మని హీనస్వరంబునం బల్కుటయు మీనకేతనుం డతిసాహసంబున బయల్వెడలి, జలాన్వేషణ తత్పరుండై బహుదూరం బరిగి, జలంబులంగానక తిరిగి తిరిగి వేసరి, యదృష్టవశంబున నందొక్కచో శీతలవిమలజలపూరితంబగు నొక్క పద్మాకరముం బొడఁగాంచి, యొక కమలపత్రంబునఁ దన్నీరంబును గొని రానుంకించునంతలో నొక్క నికుంజసమీపంబున నతిసుందరంబగు నొక కాలసర్పం బాతని పాదంబులకు జుట్టుకొనియెను. తన్నాగంబునుఁ గాంచి యా బాలకుఁడు భీతిల్లక, సాహసంబున దానినెత్తి యావలం బాఱవేసినను, మరల మరల నా సర్పంబతిప్రీతితో వెఱచి పారక యాతని యొడిలోనికిం జేరుకొని శరీరమునందెల్లెడలఁ బ్రాకులాడుచు, కపోలంబులను చుంబించుచు లీలావినోదంబుల నొనరింపఁ దొడఁగెను. ఇంతలోఁ దత్సమీపమునందేయున్న జటాశంకరమహర్షి యాశ్రమమునుండి, శిష్యుం డొక్కరుఁడు కుశపత్రాదులంగొన సమిధభూముల కరుదెంచి మీనకేతన సర్పంబుల సఖ్యముంగాంచి వెఱగంది సమీపమునకువచ్చి యాసర్పంబు నదలింప, నయ్యది కొంతదూరమునకుం బ్రాకి చని యట నొక సుందర స్త్రీరూపముందాల్చి యంతలో నదృశ్యమయ్యెను. తచ్చిత్రప్రదర్శనముం గని విస్మితుండై యున్న మీనకేతనుఁ గాంచి యబ్బాలవిప్రుండు—

"వత్సా! విస్మితుండవుగాకుము. ఇదియొక నాగకన్యకయై యుండును. నీపై మరులుగొని యున్నది. నీవత్యంతధన్యుఁడవు! నీచరిత్రంబేమి? ఇట్లు రాగతంబేమి"యని ప్రశ్నింప నాబాలుఁడు తనవృత్తాంతంబెల్ల నెఱిఁగింప నాతఁడును జాలింగొని తన కమండలముతో నుదకముం గైకొని మీనకేతనుని వెంటనిడుకొని యరణ్యమంతయు వెదకినను, అనసూయ వారికెందునుఁ గాన్పింపదయ్యెను. తల్లినిఁగానక మీనకేతనుండెలుగెత్తి యరణ్యము మాఱుమ్రోగఁ బిలుచుచు నేడ్చుచుండ మునికుమారుం డాతనికి ధైర్యముంజెప్పి తనగురుండగు జటాశంకరు నాశ్రమంబునకుం గొనిచని గురున కాబాలుని యుదంతంబెల్ల నెఱిఁగించెను. అంత

నాజటాశంకర యోగీంద్రుఁ” డబ్బాయీ! విచారింపకుము; మీ యమ్మ సజీవయైయుండును. శరీరభంగంబును, మరణంబునుఁ దెలిసి కొను ఛాయాపురుషమను దేవరహస్యమొండుగలదు. అద్దానిని నీ కుప దేశించెదను. నే నియమించినభాతి దృక్కునిల్పి దృశ్యంబగు పురుషు నింగాంచి, యాపురుషునియందుఁదోచు, లక్షణములంజెప్పుము. సకార ఓంకారంబును, బిందుసహిత అకారంబునునగు “హంస”యను రెండ క్షరములను జపించుచు, హంసునకు విముఖముగా, నిలిచి, నీశరీర చ్ఛాయనుగాంచి, జీవాక్షరస్థానమున దృష్టినిలిపి, యాదృష్టిం జెదర నీయక—మేఘంబులయందుఁగాంచుము. అం దవయవసహితమగు నొకఛాయాపురుషాకృతి నీకుగాన్పించును. ఆపురుషునకు శిరోహీన మైనచో, నారునెలలకును, కరహీనమైనచో మూడునెలలకును, చరణ హీనమైచో నొక్కనెలకును మరణంబుగల్గును. ఆఛాయ యెఱుపుగ నున్నచో, రాజ్యప్రాప్తియు, పసుపుగనుండినఁ జక్రవర్తిత్వమును తెల్లగానుండిన శరీరసౌఖ్యమును, నల్లగానుండిన రోగగ్రస్తతయు, మచ్చ లుగానుండిన నొడలికి మాఱ్పునుఁ గల్గునని యెఱుంగనలయును. చక్కఁగా బరీక్షించి వచింపుము” నావుడు, మీనకేతనుఁడు తదుపదేశానుసారంబుగఁజూచి, “మునీంద్రా! తెలుపురంగుపైఁ బసు పుకలిసినట్లు కాన్పించుచున్న”దని పలికెను. అందుల కాబుషి యానం దించి “కుమారా! నీకేకొఱంతయునుఁగలుగదనిపలికి యమ్మని యన్ సూయాన్వేషణార్థమై తన శిష్యులను నలుదిశలకుంబంపి యాకుమారు నిచే శుశ్రూషలఁగాంచుచు నాతని కనేక మహద్విషయంబునుగఱపి యాతని మహత్త్వసంపన్నునిఁగా నొనరించె”నని శ్రీకృష్ణుంబలుక నర్జునుడాశ్చర్యప్రముదితాత్ముఁడై “దేవా! ఛాయాపురుషలక్షణంబు నెఱిఁగించి నన్ను ధన్యునిఁజేసితివి. తదనంతరంబు మీనకేతనుని కథ యేమయ్యె—అనసూయ వృత్తాంతంబేమయ్యె; నెఱిగింపవే!” యనిన నాగోవిందుఁడిట్లని చెప్పదొడంగె—

కుంతీసుతమధ్యయా ! ఆయడవిలో ననసూయ యట్లుదాహబాధచే మూర్ఛిలియుండ, ధారానగరవాసియు,ననసూయావృత్తాంతంబును నెఱింగినవాఁడును, నామెపై మరులుగొన్నవాఁడును నగుకౌశికుండను నొక విప్రయువకధూర్తుం డొక్కఁడనసూయ వెన్వెంటనేవచ్చి యామె యొంటరిగనున్న తరినెఱింగి యది తనయుద్యమంబు నెరవేర్చుకొనఁదగు తరుణమని యామె దాహబాధందనకడనున్న జలంబులందీర్చి—సజ్జనుని వోలెనటించుచు, నామెనోదార్చి, యామెను దుష్పథంబునుబట్టించి మీనకేతుని వెదకినట్లునటించి, పుత్రునికొఱకై శోకించు నామె నూరార్చుచు, "నేనును కటకపురికేనత్తును. నీకు సహాయముగనుందు"నని నమ్మఁబలికి,మార్గమధ్యమునందలి ప్రతిగ్రామంబునందును నామెతోఁగలసి బసచేయుచు, నచ్చటివారితో నామె తన భార్యయని చెప్పుటకారంభించెను. అనసూయ యక్కపటబ్రువుని దుష్ప్రవర్తనంబునుగుఱుతించి, యాతనిందీవ్రముగనిందించెను. కాని యంతతో నాతఁడు తన దురుద్యమంబును విరమింపక, మొండికిఁదెగించి గ్రామంబుల ప్రజలతోనెల్ల బంచాయితివెట్టి యామె తన భార్యయనియుఁ దన్నొల్లకున్నదనియు, నిట్లే దేశదేశంబులం దిరుగుచుండుననియుఁ బెద్దగాఁ జెప్పుకొని యేడ్చెను. విన్నవారందరును నయ్యది నిజంబని నమ్మి యామెంగని నీకిదిబుద్ధిగాదని మందలింపఁ జొచ్చిరి. అనసూయ చేయునదిలేక యీతఁడు నాభర్త గాడని యెంతచెప్పుకొనినను ,నమ్మువారు లేకపోఁగా యితఁడు నీభర్త గానిచో నీభర్త యెవ్వఁడని ప్రశ్నచేయ నామె నోరాడదయ్యె. ఇట్టి రాద్ధాంతసిద్ధాంతములతోడనే క్రమంబుగ వారు కటకపురింజేరి వెదకుకొనుచు ననసూయా మాతామహుని గృహముంజేరిరి. వెంటనే యనసూయ తాతంజూచి తన యుదంతమునుఁ జెప్పుకొని బాంధవ్యము నెఱిఁగింప నాతఁడు విశ్వసించి, కౌశికనామధేయుఁడగు నక్కపటిని దూషించి యటనుండి సాగనంపెను. అంత నాతఁడు, రాజసన్నిధికరిగి యీసంగతినంతను మొఱవెట్టుకొన నాభూపాలుఁడు కొండొకదినంబున

విమర్శింతునని యాజ్ఞ సేసెను. ఈలోపల అనసూయను వెదుకఁబోయిన జటాశంకరమహర్షి శిష్యులు కటకపురంబున జఱిగిన యీకథను విని పోయి గురునకు నివేదింప, మీనకేతనుఁ "డార్యా! ఆమెయే నాతల్లియై యుండును. ఈ తరుణంబున నేనటకుఁజని నాతల్లిని రక్షింతు; నాజ్ఞ దయసేయవే!" యని ప్రార్థింప, నాతఁడు కుమారుని దీవించి, యతఁడు కోరినట్లెల్ల జఱుగునట్లు వరంబునొసంగి పంపెను. గడువునాటికి, కటక రాజగు భూపేంద్రుని పాముకఱవ నాతఁడు విగతప్రాణుండయ్యెను. మరణించిన రాజును ప్రేతభూమికిం గొనిపోవుచుండ నెటనుండియో యొక విషవైద్యుఁడు దారికడ్డమై—తన విషౌషధులవలన రాజును బ్రదికింతు నని పలుక నాశవంబునట మార్గంబుననుంచిరి. అంత నావైద్యుఁడు రాజును విషమంత్రశక్తిచే బ్రదికింప, నారాజు పునర్జీవియై, తన్ను బ్రదికించిన వైద్యునియెడ ప్రీతుఁడై యాతనికి మంత్రిపదంబు నొసంగెను. ఇది జఱిగిన మరునాఁడే కౌశికుఁడు తన యభియోగముం దీర్మానింప రాజేంద్రునిఁ బ్రార్థింప నారాజనసూయంగని యేలనో పొంగిపొరలి వచ్చిన దుఃఖంబు నాపుకొని, యీబాలను విశేషముగ గౌరవించి యీమెవలనఁ దచ్చరిత్రంబు నెఱింగియు నీభర్త యెవ్వఁడని యడిగెను. ఆమె నిజవృత్తాంతముం దెల్ప కౌశికుం డడ్డమువచ్చి రాజేంద్రా! దివ్య పురుషులేమానవకాంతలతోనైన స్వప్నంబున భోగించుటయు పుత్రుఁడు గల్గుటయు సంభవించునా? ఇది విశ్వాసార్హమేనా? ఈపలుట కట్టుకథ నొకదానిని గల్పించినంతనే మీరును విశ్వసింతురా! ఇది తప్పక నా భార్యయే! న్యాయము దయచేయుఁ"డని పలుక నాతఁడేమియుఁ బలుక నేఱక యోచించుచుండెను. ఇంతలో నాసభలోనికి స్ఫురద్రూపంబున మీనకేతనుం డరుదెంచి "రాజేంద్రా! ఈమె నాతల్లి యనసూయ. తండ్రిని నేనెఱుంగను. ఒక దివ్యపురుషుఁడని మాయమ్మ వచించెను. ఇతఁడుమాత్రము నాతండ్రిగాఁడు. న్యాయము దయచేయు!" మని యెను. అది విని యాభూపతి మఱింత యాందోళితమనస్కుఁడై తనకు

"కుమారా! నీతండ్రి యీతఁడు కాఁడంటివి. సరే! నీతండ్రి దివ్య పురుషుఁడై యట్లు ఋజువుచేసినచో, నీకు న్యాయముగల్గు" ననెను. అంత నామీనకేతనుఁడు జటాశంకరమునీంద్ర దత్తంబులగు, సర్వ మహత్త్వ శక్తులనుఁ గేంద్రీకరించి, నిమీలితలోచనుఁడై చతుర్దశ భువనంబులయందలి, సమస్తదేవతలను యక్షనాగగరుడకిన్నెరకింపురుష, పిశాచరాక్షసశాకినీఢాకినీ సందోహములం దనమనంబునఁ బ్రార్థించి, "ఓదేవాధీశులారా! నాతల్లి మహాపతివ్రతయగు విశ్వాసంబు నాకుఁగలదు. మీలో నీమెవలన నన్నుఁగన్న మహాత్ముఁడెవ్వఁడో యాతఁ డీసభామధ్యంబున కరుగుదెంచి, దర్శనంబిచ్చి, మాయిరువురను నిష్కళంకచరిత్రులనుఁగా నొనరింపుఁడని ప్రార్థింప, నత్యంతాశ్చర్యకరంబుగ నాసభామధ్యంబున భూనభోంతరాళంబులు నిండు నట్లగ్నిజ్వాలలు నోడమి కన్నులు మిఱుమిట్లుఁగొల్పుకరణి బ్రహ్మాండంబులగు మహాతేజస్సులు జన్మించి, తత్తేజోరాసుల మధ్యంబుల, సహస్రఫణంబుల తోడను, సహస్రఫణాగ్రముల యందును సహస్రమణులతోడనుఁ బ్రకాశించు నొక్క నాగరాజు దృగ్గోచరుండయ్యెను. ఆతని మహత్తమ తేజోరాశిం గాంచనేఱక, సభ్యులందఱుఁ గన్నులుండియు నంధప్రాయులైరి. తదీయ దిగ్భ్రాంతినుండి కొండొకవడికిం దెప్పఱిల్లి యారాజు ఫణిరాజుంగాంచి, "యోమహాత్మా! తమరెవ్వ" రని ప్రశ్నింప నా నాగేంద్రుఁడు గంభీరస్వరంబున, "నోరాజా! నేను వాసుకియను నాగరాజును; నన్నెవ్వరో మంత్రబద్ధుంజేసి యిటకీడ్చి తెచ్చిరి. అట్టి సమర్థతగలవాఁ డెవ్వఁడు? నన్నిందులకుఁ బిలువ గతంబేమి? నావుడు మీనకేతనుండా వాసుకింగని, "మహాత్మా! నిన్ను మంత్రబద్ధుంజేసి పిలిచినవాఁడను నేన—ఇచ్చట మాకొక గొప్ప వివాదము పొసంగియున్నది. దానిం దీర్పఁ బిలిచితి" నని, యనసూయావృత్తాంతమును, తన జన్మప్రకారంబును లోకంబునఁగల యపనిందయు, కౌశికునివివాదంబును నెఱింగించి" యిందలి వాస్తవంబును దయతో బ్రకటపఱచి యీయపనిందను, కౌశి

కుని వివాదంబును నీడేర్పు"దని పలుక, వాసుని యాయనసూయం గాంచి స్మృతి నభినయించి—"బాలకా! ఇప్పటికిఁ బదునెనిమిది వత్సరములకు బూర్వమొక్కనాడు నేను వేఁగుజామున విహారార్థినై ధారానగర పరిసరసరోవరసమీపంబున సంచరించుచుండ మీయమ్మ యటకు జలార్థియై చనుదెంచె—అంత నేనీకాంతఁగని మరుల్కొని యారేయి స్వప్నంబునఁ గలసికొని, భ్రమవాపుకొంటిని. తదనంతరం బీకాంతవృత్తాంతము నేమఱచితిని. నాటికి నేడు సపుత్రకంబుగా నీవెలఁదింగాంచితి; ఈ కౌశికుఁడు ధూర్తుఁడై వివాదంబుసల్పి మిమ్ము రచ్చకీడ్చిన పాపఫలంబునకు వీనిపై నా విషజ్వాలలం బఱపి సంహరించెద!"నని భీకరాకారుఁడై విషజ్వాలలం గ్రక్కఁదొడంగె — కౌశికుఁడు భీతిల్లె—మీనకేతనుఁడు వాసుని పాదములంబడి "తండ్రీ! అజ్ఞుఁడగు నీతుచ్ఛవిప్రున కింతటి ఘోరశిక్ష విధింపఁబనిలేదు. రాజశిక్షయే చాలును. మమ్ముఁగాంచి వీనిని క్షమియింపు"మనిన నాతఁడు శాంతించె — అంతరాజు కౌశికునకు జన్మాంతర కారాగారశిక్షవిధించి వాసుకింగాంచి," మహాత్మా! మీరు పూజ్యులు; మీకు తాత్కాలికంబుగఁగల్గిన భ్రమవాపుకొనఁగోరి యిట్లు స్వప్నంబులందు సమావేశమైనచో నక్కాంత లపనిందలపాలుగారా? ఇది తమకుఁదగిన పనియా?"యని మందలింప వాసుకి పశ్చాత్తప్తుఁడై —"రాజా! నీవనినట్లు నాకార్యంబపరాధంబయగు. తద్దోషమును వాపుకొన నీబాలుని తల్లితోఁగూడ నాలోకంబునకుఁగొనిపోయి నాసామ్రాజ్యమునందభిషిక్తు నొనరింతును—అదిగాక—నాచెల్లెలు కుమార్తెయగు, మలయవతియనుబాలిక యొకనాడు జటాశంకర మున్యాశ్రమోప్రాంతంబున నీమీనకేతునుంగని, మోహావేశమునొంది నవయుచున్నయది. దానిని నాకుమారుండగు నీమీనకేతునకుమారునకిచ్చి వివాహమొనరించెద! దేవీ! అనసూయా! నిన్ను విశేషముగ నపకీర్తిపాలొనరించిన బుద్ధిహీనుఁడ! నన్ను క్షమింపు"మని పలుక ననసూయ భర్తృపాదంబునకెఱగి—"దేవా! ఇదినాపురాకృత పాపఫలము; అది

నేటికిగతించె; ఇప్పటికి ధన్యాత్మనైతి” ’నని పలికెను. అంత నాదేశపు రాజు సర్వజనులంగాంచి—“విధివిధానం బత్యద్భుతము! నే నీయన సూయ సోదరుండనగు సుమతిని. ఇప్పుడు నాకు మంత్రిగానున్నవాఁడు నాతమ్ముఁడగు ధీమతి. అనసూయ గర్భిణియైయుండుటెఱింగి మే మొక రిపై నొకరమనుమానమునంది, గృహత్యాగుల మైపోయితిమి. అట్లుచనిన నేను కాశీపురంబున నొకమునీంద్రు నాశ్రయించి పరకాయప్రవేశవిద్య నెఱింగి, యీపురంబుననే నా కకస్మాత్తుగఁదారసిల్లిన ధీమతింవలన వాని నిర్దోషిత్వమునెఱింగి నానిర్దోషిత్వమును వానికెఱిఁగించి యీపురంబు నకురాగా నీరాజుమరణించెను. అంతట ధీమతి విషవైద్యునివలెవచ్చి మంత్రింప, నాయాత్మ యీరోజున శరీరంబునఁ బ్రవేశించెను. అంత నీరాజు జీవించెనని ప్రజలానందించిరి నేను నాసోదరునే సచివునిగా నేర్పఱచుకొంటిని. కొండొకచో నాశరీరము భద్రముగనున్నది. ఈరాజ్య మును విప్రుండనగు నే నపేక్షింపనోప — నామేనల్లునకే దీని నొసంగ సంకల్పించితిని. ఇతఁడు కొన్నినాళ్లు నాగలోకంబునను, కొన్నినాళ్లు కటకంబుననుండి, యుభయరాజ్యంబులం బరిపాలించుకొను నట్లాజ్ఞా పింపుమని వాసుకిని వేఁడుకొనియెను.

అత్యద్భుతంబగు నా సమావేశంబున కెల్లఱుఁ బ్రమోదావహు లైరి—అన్నలంగని యనసూయ యానందబాష్పంబులను రాల్చెను. మీనకేతనుండు మేనమామలకు నమస్కరించి వారి కోరికప్రకారము వర్తింతునని పలికెను. అనంతరము వాసుకి దారాసుతులను నాగ లోకంబునకుఁ గొనిచని, మలయవతినొసంగి మీనకేతనుని వివాహంబు నతివైభవంబుగ నొనరించెను. సుమతి నిజశరీరమును ధరించి సోదరు నితోఁ గలసి నిజపురంబగు ధారానగరంబున కరిగెను. అనసూయా వృత్తాంతము జగద్వ్యాప్తమైన కతన ధారానగరవిప్రులు సుమతి ధీమ తులను క్షమింప వేఁడుకొని కులంబునఁ జేర్చుకొనిరి. మీనకేతనుండు కొన్నినాళ్లు భూలోకంబునను, కొన్నినాళ్లు నాగలోకంబునను వసించుచు,

మలయవతితోఁ గూడి యిష్టభోగంబుల ననుభవించుచు, సుఖంబుగా నుండెను.

---

## మూఁడవరాత్రి కథ.

మూఁడవనాటిరాత్రి యథాపూర్వంబుగఁ గృష్ణార్జును లిరువురును, యమునానికతాతలంబునం దాసీనులై నాగవల్లీదళచర్వణం బొనరించుతరి, పార్థుండు కేశవుం దిలకించి—"స్వామీ! గతరాత్రి వచించిన కథ యద్భుతంబై యుప్పారె! నేటిరేయి మూఁడవదియగు నాదానందతత్త్వముతోఁ గూడిన పుణ్యకథ నెఱిఁగించి ధన్యుం జేయవే!" యని ప్రార్థింప సర్వోత్తముండు భీభత్సుం గాంచి—"విజయా! చిరకారి మహారాజు చరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుము. దీనివలన నీయభీష్టం బీడేరెడు" నని పలికి యిట్లు వచియింపఁ దొడంగె—

# చిరకారిమహారాజుకథ.

తొల్లి త్రిగర్తపురంబున మేఘానిధియను రాజొకఁడు ధర్మమార్గుఁడై, పరిపాలించుచుండెను. అతనికి చంద్రరేఖ యను సతీతిలకంబు వలన గళానిధియను పుత్త్రరత్నంబు జనియించెను. ఆబాలునకు షణ్మాసప్రాయంబు గల్గియున్నతరుణంబున, యొకసిద్ధుం డాతనికడ కరుదెంచి, యాతని మానసంబును వైరాగ్యమార్గంబునకు మరల్ప నారాజు కాయసిద్ధికై —యమ్మునివెంట హిమాలయంబున కరుగుచు, నప్పటికి గర్భవతియైయున్న పత్ని నింటవిడిచి, తన సోదరుఁడగు శ్వేతకేతునకు రాజ్యం బప్పగించెను. మేఘానిధిరా జరిగినయనంతరంబున శ్వేతకేతుఁడు దుర్మార్గుఁడై వధూనికను నిరాదరణం బొనరింప నాసాధ్వి యట నుండనోపక, విశ్వాసపాత్రురాలగు తన సఖియగు తిలకతోఁగూడి సంచారిణియై గర్భభారంబున నత్యంత శ్రమననుభవించుచు, నాజేంద్ర పుత్త్రు

డగు కళానిధితో, తన సోదరుఁడును అవంతిపురాధిపతియు నగుమంత్ర గుప్తరాజుకడ కరుగుచుండ, మార్గమధ్యంబున, నొక్కచో రాత్రికాలంబున నొండొక విపినంబున శయనింప, నెవ్వరో చోరులు కుమారు నపహరించిరి. గర్భవతియగు, చంద్రరేఖ యీదారుణంబునకు సహింపనోపక—మూర్ఛమునింగెను. తిలక యామెకుఁగలిగిన విపత్తునకు వగచుచుఁ గంటికి ఱెప్పవోలెఁ గాపాడుచున్నను, చంద్రరేఖ బహుదినంబులదనుక మూర్ఛతేరుకొనదయ్యె—ఇట్టి యవస్థలోననే యొక్కదినంబున నించుక మూర్ఛతేఱి, చంద్రరేఖ కుమారునికొఱకై దుఖించుచుండ నామార్గంబున నెందేనింజను నవంతీపురవాసియగు నొకవిప్రుండట కరుదెంచి, యవంతీపురరాజగు మంత్రగుప్తుఁడై శత్రువులచే రాజ్యభ్రష్టతనంది యెందోచనియెనను పిడుగుఁబోలినవార్త నెఱిఁగింప—పుండుమీఁద రోకటిపోటుచందంబున నీవార్త చంద్రరేఖకు మఱింత దుర్భరమైయొప్ప—మొదలునరికిన పెనునటంబుకరణి మరల మూర్ఛమునింగెను. ఆమూర్ఛయందే యామె సౌజ్ఞారహితస్థితియందు ప్రసవింప నొక స్త్రీ శిశువు గలిగెను. కాని యాబాల జన్మించిన కొన్ని గడియలవఱకు గదులకున్నంత, మృతశిశువే జన్మించెననితలంచి తిలక మిగుల దుఃఖాక్రాంతయై చంద్రరేఖకు స్మృతిగల్గు లోపలనే శిశువును భూస్థాపనంబొనరింపనెంచి, యొకచో గర్తముం ద్రవ్వి, బాలికంబూడ్పనుంకించునంతలో, నొకవ్యాఘ్రఘోరానము వినంబడుటయు నామెభీతిల్లి—బాలికనందేవిడిచి నికుంజంబున మాటునకుం బలాయితయయ్యెను. ఇంతలోఁ గొందఱు కాటిపాపలామార్గంబున నరుగుచు, నప్పుడే కన్నులుదెఱచి శోకించుచున్న బాలికంగాంచి, తమ వెంటఁగొనిపోయి, యవంతీపురంబునఁగల మల్లికయను వేశ్యకు విక్రయించిరి. అట్లువ్యాఘ్రభీతిచే నరుగుసమయంబున తిలకకుఁగూడ బాలికారోదనంబు వినంబడియె—గాని కాటిపాపలరుదెంచి బాలికం గొనిపోయినజాడఁ గాంచదయ్యె— బాలిక రొమ్ముపైఁగల పుట్టుమచ్చ మాత్రము తిలకస్మృతిపథంబున నుండెను. వ్యాఘ్రభీతితొలంగిన కొం

డోకపడికి తిలక మరలఁ దాను బాలికనుంచినయెడ కరుదెంచిచూడ నందు బాలిక గానరాదయ్యె; తన్నుభీతిలంజేసిన వ్యాఘ్రమే యా శిశువును గబళించెనని, తలంచి, తిలక మిగుల శోకించుచు, నప్పటి కింకనుమూర్ఛతేఱని చంద్రరేఖకడ కరుదెంచి కాఁచియుండ నింతలో దైవవశంబున నొక యెఱుకత, మూఁడేండ్లబాలు నొకనిఁగొని యటకరుదెంచ నాశిశువు చంద్రరేఖనుజనించిన శిశువని భ్రమించి దానిని వెఱపింప, నది పురుషశిశువుగాని స్త్రీశిశువుగాదయ్యె—ఆశిశువునకై కొంతధనమిచ్చి తిలకయాయెఱుకనద్దగొని, యీలోపల మూర్ఛదేఱిన చంద్రరేఖ కాబాలునింజూపి "తల్లీ! నీవు మూర్ఛిల్లినతరి నీకీబాలుఁడుజన్మించెను. నీవాఱునెల లోకేమూర్ఛయందుమునిగియుంటివి. ఈబాలుఁడెట్టి విపరీతవేళ జన్మించెనోకాని పుట్టినపుడే దంతములుగల్గియుండెను. నెల దినములలోననే నడువఁగలిగెను. రెండవనెలలో మాటలునేర్చెను. ఇప్పుడు మూఁడునెలలకే మూడేండ్లవానివలెనున్నాఁడు," అని పలికెను—చంద్రరేఖయాబాలుంజూచుకొని, చోరాపహృతుండగు కళానిధిని మఱచియుండెను. ఈలోన, నవంతీరాజ్యమునందలి పుష్కరాగ్రహారమునవసించు నొక విప్రుండుకలసికొని యామె తమ ప్రభువునకు సోదరియని యెఱింగి, తనయింటికిఁ గొనిపోయి, స్వపుత్రికంబలెపోషించుచు నబ్బాలకునకు విశారదుం డనునామకరణంబొనరించెను. ఇది యిట్లుండ రాజ్యకాంక్షచే శ్వేతకేతువు కళానిధిని దొంగలమూలమున తస్కరింపజేసి చంపింప యత్నించుచుండగా—హిమాలయంబునకరిగియుండిన, మేధానిధిరాజు, సిద్ధునివలన నప్పటికి కాయసిద్ధినందఁజాలక మఱికొన్నిదినంబులకు రానాజ్ఞాపింపబడి పురంబునకువచ్చుచు, చోరులచే సంహరింపఁబడనున్న స్వపుత్రుఁడగు కళానిధిని రక్షించి గృహంబునకుఁ గొనితెచ్చెను. ఈలోపల స్వకీయ పాపఫలంబుగా శ్వేతకేతునకుఁ గన్నులుపోవ నాతఁడంధుఁడై పశ్చాత్తాప దుఃఖంబున సోదరుని పాదములంబడి క్షమింపఁ బ్రార్థించెను. రాజు

సోదరుని క్షమించి, తన దేవియగు చంద్రరేఖ పుష్కరాగ్రహారంబున నుండుటెఱింగి, యామెను రప్పించి, విశారదుండను పుత్రుండు గల్గుట కలరి యల్లారుముద్దుగాఁ బెంచుచుండెను. ఇది యిట్లుండ, నాడు కాటిపాపలచేఁ దనకు విక్రయింపఁబడిన బాలికకు మల్లిక, మోహిని యను నామకరణంబొనరించి పెంచి, సమస్తవిద్యలను నేర్పి యామెకు వయస్సు వచ్చినంతనే, వ్యభిచారంబునఁ బ్రవేశపెట్ట నుంకించెను. కాని మోహిని యందుల కియ్యకొనక, తన్నుఁ గామించివచ్చిన, మనోహరుండనువానికి వేదాంతోపదేశ మొనరించి మనంబు మరలింప వాఁడు విరాగియై యామెకు మాతృభావంబున నమస్కరించి తన సాటివిటులందఱను వ్యభిచారవృత్తినుండి మరలించెను. మోహినిమూలంబునఁ దనవృత్తి నాశనంబగుటకు దుఃఖించి మల్లిక యాబాలిక ననేకబాధలం బెట్టుచుండ మోహిని సహింపజాలక, నొకరేయి తద్గృహంబువాసి యొక మహారణ్యంబునంబడి పోవ పోవ, దైవవశంబున నొక్కచో జటిలమహాముని దివ్యాశ్రమంబు నయనగోచరంబుగాఁ గాన్పించెను. అంత నాయెలనాగ, జటిలమహర్షి నాశ్రయంబులంబడి తన వృత్తాంతమంతయు నెఱింగించి తరణోపాయమును దెలుపుమని ప్రార్థింప నామహర్షి యాబాలకు ధైర్యము గఱపి—"బిడ్డా! పరమపావనంబును, సర్వపరోత్తారకంబును నగు నాదానందమును నీకు బోధించెదను. దీనం బవిత్రురాలవుగ"మ్మని పలికి నాదానందప్రభావము నెఱింగించెను. మునీంద్రునివలన నారాజపుత్రిక నాదానందప్రభావము నాలకించి—మోదమంది "యోపుణ్యపురుషా! నాదానందసౌఖ్యంబు ననుభవించితి, ఇది యిట్టిదని చెప్ప నలవిగాని మహానందము; నాభాగ్యమూలంబున నిట్టి మహానందముగలిగెను దేవవాద్యంబులనన్నింటి నాలకించి ధన్యాత్మనైతి. ఇంక మీపరిచర్యవదలక నేనిందే యుండుదాన; నన్ను ధన్యురాలిం జేయుఁ"డని పలుక నాజడదారి "యోబాలా! నీవు యుక్తవయస్కవగు కాంతవు; నీయునికి మా తపోనిష్ఠల కంతరాయమును గల్గించును. కాన నీవిందుండఁ జనదు. మిథిలాపురాధి

పతియు, ధర్మజ్ఞుఁడును నగు మేధానిధిరాజేంద్రుని ప్రాపున కరుగుము.
ఆరాజు నిన్ను స్వపుత్రికనుంబలె గౌరవించి పెంచు"నని పలుక మోహిని,
యా మునీంద్రుని యాజ్ఞానుసారంబుగా మిథిలానగరంబున కరిగెను. అట్లు
చని, మోహిని యారాజదంపతులతోఁ దన చరిత్రంబెల్ల దాఁచక నెఱిఁ
గించినంతనే—నిజపుత్రికగావున, తద్రహస్యంబు నెఱుంగకున్నను, సవ్యా
జంబగు వాత్సల్యంబుగలుగ, నాబాలిక నతిప్రేమంబునఁ బెంచుచుండిరి.
మోహినిం గాంచినప్పటినుండియు, విశారదున కామెపై గాఢమగునల
పును, కళానిధి కట్టిట్లనినిర్ణయింపరాని యెట్టిదియో యొకప్రేమంబును
గలుగసాగెను. అంత నవంతీపురాధిపతియగు, మంత్రగుప్తరాజు సమీప
రాజన్యుల సహాయంబునంది మగుడ తనరాజ్యంబు నాక్రమించిన శత్రు
భూపాలు నోడించి, రాజ్యంబుసేయుచు, నొక్కనాఁడు తనసోదరి
భావమఱందని దర్శించిపోవ నభిలాషంబుపొడమ—ముందుగా మేధా
నిధి కిట్లొక లేఖవ్రాసి పుత్తెంచెను. "శ్యాలకా! దైవానుగ్రహంబున
నారాజ్య వైభవంబులను మరల సందగంటిని. మే మందఱ మిందు
సేమముగా నున్నారము; కాని నేను రాజ్యభ్రష్టుండనై శత్రు
రాజుచేఁ దఱుమఁబడి యొక యరణ్యంబున నరుగునెడ, నుత్కు
మారుఁడగు విజయుని, మూఁడేండ్లవాని, నెవ్వలో తస్కరులు
హరించిరి. వానిఁబోఁబడి నేటిదనుకఁ గానరాదయ్యెను. అదియే నాకును మీ
చెలియలికిని మిక్కిలి విచారముగనున్నది. కతిపయదినంబులలో నేను
మిమ్మొక్కమాఱుదర్శింప మిథిలకు వచ్చుచున్నాను". మంత్రగుప్తుఁడు
లిఖించిపంపిన లేఖంజూచుకొని విజయునిఁబోఁబడిరిఁ జంద్రరేఖయు,
మేధానిధియు విచారమునంది మంత్రగుప్తునిరాక కెదురుచూచుచుండిరి.
ఇట్లుండ మోహిని, మహానందముతో నత్యంతమగు చనువున రాజ
ప్రసాదంబునబెరుగుచు, చిత్రములగు కథలతోడను, పరిహాసములతోడ
ను, సంగీతకళావ్యాసంగముతోడను చంద్రరేఖ నానందింపఁజేయుచు నొక్క
నాఁడు చంద్రరేఖంబరిహాసింపఁదలంచి, పురుషాకృతినహించి ...

తాను రాజ్యమునుచాలించి, కుమారుఁడగు చిరకారికిఁ బట్టాభిషేక మొనర్చించి వానప్రస్థుఁడై క్షేమంబగు జీవితంబును ప్రమోదంబున గడిపెను.



## నాల్గవనాటిరాత్రి కథ.

పదంపడి, యథాపూర్వకంబుగం దురీయదివసయామినీ సమయం బునఁ గృష్ణార్జునులు, యమునాసైకతప్రదేశంబున సుఖాసీనులై— యున్నతరి పార్థుండు నారాయణుం దిలకించి, పంచముద్రల రహస్యంబు నెఱిఁగించు వినోదకథ నొండెఱిఁగింపుమని వేఁడుటయు, నాతఁడు బావ మఱఁదిం జూచి, వీరబాహుమహారాజు చరిత్రంబు నాకర్ణింపుమని యిట్లు నివేదింప నారంభించెను.

# వీరబాహుమహారాజు కథ.

ఫల్గుణా! తొల్లి యుత్కళదేశంబును పరిపాలించిన శూరబాహు మహారాజునకుఁ మహాబాహువను సహోదరుం డొక్కఁడుండెను. శూర బాహువునకు వీరబాహువను పుత్రుండను, మహాబాహువునకు క్రూర బాహువను కుమారుఁడునుఁ గల్గియుండిరి—ధర్మప్రభువై చిరకాలము రాజ్యపాలనం బొనరించి, వృద్ధాప్యంబు పైకొన, సుశీలయను భార్యను, ఏకపుత్రుఁడగు వీరబాహువును వదలి పరలోకంబున కరిగెను. సోదర మరణానంతరమున రాజ్యాపహరణదుర్బుద్ధి జనింప, మహాబాహువు, యువరాజు నెట్లైనఁ బోకార్పనెంచి, యర్ధరాత్రంబునఁ గొందఱు కిరా తులకు యువరాజు నపహరించి నడుకాన నఱికివేయున ట్లానతిచ్చెను. మహాబాహువువలన ధనలాభమునొందిన తత్కిరాతు లంతఃపురమునం దూరి, సుశీల మొఱ్ఱోయని యేడ్చుచుండ బలవంతమున యువరాజుం గొని చనిరి. ఈ క్రూరకృత్యంబెల్ల తన మఱఁదియగు మహాబాహుని

రాజ్యాపహరణ దురాశామూలకంబని గ్రహించిన యా వీరవనిత, యందులకుఁ బ్రతీకారం బొనరింప సముద్యోగించినదియై యా రాత్రియే రహస్యంబుగ మహాబాహుని యంతిపురముం బ్రవేశించి, యాతని పుత్త్రుండగు క్రూరబాహువు పరుండు డోలికను సమీపించెను. ఆడోలికయందు సుఖనిద్రాముద్రితులగు నిరువురు పసిపాప లామెకుఁ గాన్పించిరి. అందొకఁడు క్రూరబాహువనియు, రెండవది తన వధూని కాపుత్రికయగు, శైలవతియనియు నెఱింగియు, నాతురంబున విమర్శింప వ్యవధిచాలమింజేసి సుశీల క్రూరసేనునకు మారుగా, శైలవతి నపహరించి రయంబున రాజసౌధంబును నిర్గమించి, స్త్రీ సహజంబగు కృపారసంబు పెంపున నబ్బాలుని వధింపజేయాడక, తత్పురవాసినియు సంతానహీనయు, నిరుపేదయునగు లీలావతియను కాంత, తద్వసంతకాలయామినియందు, నడువీధిలో నిద్రించుచుండ తత్పార్శ్వంబున నాబాలికంబరుండఁబెట్టి యెందేనింజనియె. లీలావతియు వేకువనే నిద్దురలేచి, అత్యంతసౌందర్యశాలినియగు బాలికయొకతె తన శయ్యయందుండుటంగాంచి తనకు పరమేశ్వరుఁడు ప్రసాదించిన వరప్రసాదిని యనిభావించి మహానందంబునఁ దనభర్తయగు తారాపతికిఁ జూపి యాబాలకు చిత్రయను నామకరణంబొనరించి, యల్లారుముద్దుగాఁ బెంచుకొనఁదొడంగెను. ఆపురంబున, నతిగౌరవనీయ క్షత్రియ వంశోద్భవుఁడును దరిద్రుఁడునునగు, చిత్రరథుండను వాఁడు నిజోదర పోషణార్థమై రాత్రివేళలనడవికింజని కట్టెలుంగొట్టి తద్విక్రయధనమూలంబున జీవించుచుండువాఁడు. ఆనాటిరాత్రియు నాతఁడొక వృక్షము నారోహించి చంద్రికాప్రసారంబున కట్టెలుగొట్టనుంకించుచుండ, వీరబాహువునపహరించిన కిరాతుఁడు విధివశంబున తద్వృక్షమూలంబునకే నచ్చి బాలునిచంపనెంచి కత్తినిపైకెత్తుటయు, బాలుఁడు రోదనంబొనరించుటయుఁగాంచి, చిత్రరథుండు తనకును సంతానములేనందున హృదయము దయామయంబగుడు, గుభాలున నాతరుశాఖనుండి భూమికుఱికి,

స్వపాణిత లక్షంబగు పరశువుచే నాకిరాతునివధించి, బాలునిఁగొనిపోయి వీరుడనిపేరిడి, పోషించుచుండెను. తార పతియొక్కయు, చిత్రరథుని యొక్కయు గృహంబు లతిసన్నిహితంబు లగుటంజేసి, దినదిన ప్రవర్ధమానులగుచున్న చిత్రావీరులకు, మైత్రి యతిదృఢతరంబయ్యె అమలు నాడు డోలికయందు బాలికలేమింజేసి, మహాబాహువు మహత్తరంబగు నాందోళనంబునంది, పదచిహ్నంబులవలన, నాశిశు చౌర్యకార్యము, సుశీల వలన జఱిగెనని గ్రహించి సుశీలాశైలవతుల కొఱకై యనేక ప్రదేశంబుల నన్వేషింపఁజేసెనుగాని, వారిపోబడి యెందునుఁ గానరాదయ్యె. అంతనారేడా శోకపహతుండై తన పుత్త్రుఁడు కుశలియైయుండుటయే మహాభాగ్యమని తలంచి సంతృప్తుండై నిరాటంకముగ రాజ్యపాలనం బొనరించుచు పిదప పదునేను వర్షంబులకు శరీరము చాలించెను. అంతఁగ్రూర బాహువు రాజ్యారోహణంబొనరించి, యన్వర్థనామధేయుఁడై సదాక్రూరకార్యంబుల నొనరించుచు, దినంబులు గడుపసాగెను. ఆ క్రూరబాహువునకు సమస్తసద్గుణ సంపన్నయగుధారుణీ నామకభార్యారత్నంబమరి, యత్యంత భక్తితో భర్తృసేవల నొనరించుచున్నను, క్రూరాత్ముఁడగు క్రూరబాహువు పరదారా లోలుఁడై యాసాధ్వినొల్లకయుండెను. ఇది ఇట్లుండ నిచ్చట చిత్రయు వీరుఁడును యుక్తవయస్కులై యన్యోన్యప్రేమపాశబద్ధులైయుండిరి. చిత్ర యను దినంబును సుగంధపుష్పోపచయ మొనరించి, వానితో నందంబులగు మాలికలను, చెండ్లను నిర్మించి, పౌరులకు విక్రయించుచుండునది. ఒకానొక దివసంబున నాబాలిక పుష్పవిక్రయం బొనరింప రాజప్రాసాదంబునకరిగిన తరుణంబున నాబాల క్రూరబాహుని కంటఁబడియెను. అంతనాక్రూరుఁడా బాలను బలాత్కరింప నుద్యమించుటయు, నామె భీతకురంగమువలె వాని బారింబడక వీధులం బరువిడుటయు, లజ్జాగౌరవ విసర్జితుఁడగు క్రూరబాహు వామెను వెంబడించుటయు వీరుని కంటఁబడ, నాతఁడాకొన్న శార్దూలము

కరణి గర్జించుచు రయంబున నరుదెంచి, యారాజుపైఁబడి ప్రాణావ శిష్టునిగాఁ బ్రహరించి చిత్రను రక్షించెను. పురమధ్యంబునఁ దనకుఁ గల్గిన మహావమానంబును సహింపనోపక క్రూరబాహువు వీరుని పట్టి బంధింప శాసించి యనేకయోధులనంపెను. అత్యంత పరాక్రమబాహు వగు వీరుఁడు తద్యోధులందనేకులను హతమార్చి తక్కుంగలవారికిఁ జిక్కక, పటురయంబున శ్రీజగన్నాథస్వామి యాలయమునం బ్రవేశించెను రాజభటులు దేవాలయ ప్రవేశంబునకు వెఱచి వెనుకకుమఱలి రాజుతో సర్వవిషయంబులను నివేదించిరి. అట్లు జగన్నాథదేవాలయముం బ్రవేశించినవీరుఁడు తదాలయంబునఁబూజ్యుఁడై యనేక శిష్యగణంబుతో వసించి యున్న, సచ్చిదానంద మహర్షి పాదంబులనాశ్రయించెను. పుణ్యాత్ముండగు, నమ్మహర్షి, యాకుమారు నాశీర్వదించి, "వత్సా! భీతిల్లకుము. పవిత్రంబగు నీపుణ్యభూమిం జేరఁగలిగిన నీకు క్రూరబాహుని భటుల వలన నపాయముఘటిల్లదు. నీవు మాశిష్యకోటియందొకండవై తరింపుము నీకు—తరుణోపాయముగా—పంచముద్రల తెఱంగెఱింగించెదము. సావధానుఁడవై యాకర్ణింపు"మని పలికి వెండియు పంచముద్రల రహస్యంబు నెఱిఁగించెను.

ఇది యిట్లుండ, నిచ్చట—పరాభూతుండైన క్రూరబాహువు తా నేవిధంబునంగాని యాచిత్రను పరిణయమాడంగోరి, యామె తలిదండ్రుల కమితధనంబునొసంగి నిజేప్సితంబునెఱిఁగింప నానిరుపేదలు రాజబాంధవ్యంబునకన్న నధికంబగుభాగ్యమువేరొండుగలుగదని, యుబ్బితబ్బిబ్బయి, వల్లెయని నరపాలునకు వాగ్దానంబొనరించిరి. అంత నారాజు బలాత్కారవివాహంబునకై సర్వసన్నాహంబుల నొనరించుచుండెను. ఈవార్తక్రమక్రమంబుగ, వీరుని చెవిసోకనాతఁడు తామరాకులోని నీటివలె తత్తరమునందు చిత్తముతో, సచ్చిదానందుని పాదములంబడి యాచిత్రను రక్షింపనరుగ నానతియొసంగుమని ప్రార్థించెను. అంతనామునిభవితవ్యమునుగుఱించి, చూచి, "వత్సా! ఇప్పుడు నీకరిష్ట

కాలమువచ్చియున్నది. ముందు వెనుకలాలోచింపక యౌవ్వనగర్వంబున నరిగితివేని పరాభూతుండవగుదువు. కొన్ని దినంబులు శాంతింపు"మని పలుకనా బాలవీరుండు కన్నీటిఁగరతలంబునఁదుడుచుకొనుచు "మహాత్మా! చేతులు కాలినపిదప నాకులతో పనియేమి? కొన్ని దినంబులు విఖారానతిచ్చి నట్లు శాంతింతునేని చిత్ర న్నా క్రూరుఁడు బలాత్కృతిఁబరిణయంబాడును. కావున నన్నాటంకపరుపకుఁడని మరిమరి ప్రార్థింప, నాయతి చేయునది లేక యాతని, నిండుమనంబున దీవించి యొక రక్షఁగట్టి "బాలకా! ఈరక్ష యీజగన్నాథాలయ భక్తులచిహ్నము కావున నీకు రాజువలన ప్రాణ భీతిగలుగదు. పోయిర"మ్మని సెలవొసంగెను. ఈలోన క్రూరబాహువు చిత్రం దనయంతఃపురంబునకుఁ బిలిపించుకొని, యనర్ఘ్యమణిభూషణములతోడను, చీనిచీనాంబరములతోడను నామెను భ్రాంతనుగావించి వశపరుచుకొనఁదలంచుచుండెను. వీరుఁడు నిశీథకాలంబున ప్రబల రజ్జుసహాయంబున కుడ్యంబునకెగఁ బ్రాకి, చిత్రయుంపబడిన మాదిరమునమూరె, యామెకు ధైర్యముంగఱపి, రహస్యముగ రాజమందిరమునతిక్రమించి యరుగు వెఱవు నాలోచించుచుండు తరుణంబున నామందిరమును రక్షించు దాసీజనంబులు మేల్కాంచి, వీరునింగాంచి కల్లోలముగావింప రాజును నితరభటవర్గంబును తెలివినంది యావీరుని నిరోధింప నాతండు కయ్యంబునకుపక్రమించి యనేకభటులఁబిల్కుమార్చి, రాజమందిరమునందు రక్తపుటేరులం బ్రవహింపఁజేసి విధిబలంబుతప్పుటచే నిర్బంధింపఁబడియె. అంతఁగ్రూరబాహువాతని వధింప భటుల కాజ్ఞనొసంగ వివేకశాలియగు నాతనిమంత్రి తదుద్యమంబు నాటంకపఱచి రహస్యముగ రాజుంజేరి—"నరేంద్రా! ఇతఁడు, జగన్నాథాలయ భక్తకోటిలోని వాఁడగుట నాతనిచేతంగలరక్ష సూచించుచున్నయది. కావున నీతఁడువధార్హుఁడుకాఁడు. కొండొకయుక్తింబన్ని, చిత్రావీరులప్రేమను భంగముచేయుదము. అంతటితో నీతుంటరి మనకడ్డమురాఁడు. తమనిజ సతీతిలకంబగు ధారుణీదేవికి చిత్రధరించు పరిచ్ఛదంబుల ధరింపఁజేసి,

యాసతిని దేవరవారు ముద్దిడుకొను సమయంబునకు మేము వీరునకు తద్దృశ్యమును దూరమునుండి చూపుదుము. అంత నావెకలి వికలమతియై చిత్రయందు విరక్తి నందు"నని యుపదేశింప రాజు వల్లెయనియెతత్ప్రయత్నముననుండె. ఈలోపల, కారాగృహబంధితుఁడై యున్న వీరునికడ కరుదెంచిన రాజసచివుఁడు "వీరా! నీవూరక చిత్రకొఱకేలదుఃఖించి విపత్తులకులోనయ్యెదవు? స్త్రీలమనంబు లతిచంచలంబులనుట యెఱుంగవా? నీవు దరిద్రుఁడవనియు రాజుదేవేంద్రతుల్య భోగియనియు నెఱింగి చిత్ర యిదివఱకే యాతనిమఱగియున్న"దని పలుక నాతఁడాపలుకుల నెంతమాత్రమును విశ్వసింపఁడయ్యె. అంతనామంత్రి వీరునకు నిదర్శన పూర్వకముగఁ జూపఁదలంచి యాతనింగొని రాజమందిరమున కరుగ పూర్వోదాహృత ప్రకారంబుగ రాజు, ధారుణిని ముద్దిడుకొనుట గాన్పించెను. అంత నాతఁడది నిజంబని, విశ్వసించి చిత్రయెడలగల విశ్వాసముం గోల్పడి విరక్తుఁడై పురంబును వదలి, యెందేనిం జనియెను. అట్లు బహుకాలంబునకు తనభర్త తనయందనురక్తి గల్గియుండుటకు ధారుణి యానందించుచుండ తన తంత్రము ముగియుటతోడనే క్రూరబాహు వాసాధ్వినావలఁద్రోసి, తాను పన్నిన కపటనాటక కథ నెఱిఁగించి పరిహాసించెను. అంత నా నెలంత యాశాపహతయై—అదీ యావమానంబును భరింపజాలక, స్వసుఖమార్గ కంటకప్రాయమగు చిత్రను దునిమి పగదీర్చుకొనఁదలంచి కరవాలమును చేఁబూని, చిత్రామందిరంబునకరుగ, నాటిరేయి విధివశంబున చిత్రకు మారుగ నాశయ్యపై నొక పరిచారిక శయనించి యుండెను. దాని నెఱుఁగక రాణి క్రోధోద్రేకంబున నాపరిచారికను చిత్రగా భ్రమించి సంహరించెను. తత్కరవాలధ్వని నాలించి యనేక పరిచారికలు మేల్కని కేకలువేయ నరపాలుఁ డటకరుదెంచి యట్టి దారుణకార్యంబు నొనరించిన రాణి నొక యినుపబోనునందుంచి శార్దూల సంచారభీకరంబగు మహారణ్యంబున నొక వృక్షశాఖకు వ్రేలాడదీసి వదలి రా, భటులకాజ్ఞాపింప వారట్ల

కావించిరి. మహారణ్యంబునందు బోనులో నాహారపానీయ నిద్రాదులు లేక యేడుదినంబులు గడపి మరణాసన్నమైయున్న ధారుణి తన్మార్గంబు ననే విరక్తిచే నరుగుచున్న వీరుఁడు పొడగాంచి యామెను రక్షించి వెలికిఁదీయ నామె రాజు తన కొనరించిన యపరాధమును చిత్రపై నాతని కవిశ్వాసముఁ గల్గుటకై తన్నాధారముగాఁ జేసికొని కావించిన తంత్రమునుఁ దెలిపి ప్రాణంబులు బాసెను. అంతట వీరుఁడు మహాపశ్చాత్తాప దుఃఖితుఁడై మరల జగన్నాథాలయంబున కరిగి జఱిగిన సర్వ వృత్తాంతముల నెఱిఁగింప నమ్ముని యాదేవాలయ భూగర్భమునంగల గుప్త మార్గంబున వీరుని వెంటనిడుకొని చని యొక పర్వతప్రాంతముఁజేసి సాంకేతికము నూదినంత, తండోప తండములగు సేనలు వివిధాయుధములతో బిలబిల నటకరుదెంచి యోగికి మ్రొక్కి నిలిచిన నాతఁడా సేనల వీరునకుఁజూపి, "వత్సా! వీరంఱును క్రూరసేనుని దౌర్జన్యమున కోర్వఁజాలక పితూరి యొనరింప సిద్ధమైన రాష్ట్రీయజనులు. నేటికి క్రూరబాహుని పాపములు పండినవి. వీరందఱికిని నీవు నాయకుఁడవై ముందునడిచి రణరంగము నందాతని నిర్జింపు" మని పలుక వీరుఁడు మహానందము నంది సేనలతో దండయాత్రకు బయలుదేరెను. ఈలోన, క్రూరబాహువు చిత్రను పరిణయమాడ సర్వసన్నాహములనుఁ గావించి కల్యాణమందిరమునందుండెను. ఇంతలో భయంకరంబగు భేరీ నినాదం బును పురంబును కొల్లగొను శాత్రవుల సవ్వడియు వినంబడుటయు, నాతఁడు భయకంపితుఁడై కల్యాణ రంగమునుండి కదనరంగము నందడుగువేసెను. ప్రచండమగు రాష్ట్రీయ ప్రజాసైన్యమునకు తాళఁజాలక రాజసైన్యము పటాపంచలై పోవ రాజు బంధింపఁబడియె—దీనవదనుఁడై యున్న క్రూరబాహుని చుట్టుముట్టాగి ప్రజలు పరిహసించుచు శూలములవంటి పోటుమాటలతో నొప్పించుచుండ నటకు సచ్చిదానంద యోగి యరుదెంచి ప్రజలనందఱంగాంచి "యోమహాజనులారా! క్రూరబాహువు బంధింపఁబడియెఁ గావున నికమీఁదట నీకుట్టిడే

మీకుప్రభువు. హీనుకులజుఁడగువీఁడు మాకేటిప్రభువను సంశయము మీకక్కఱలేదు. ఇతఁడే యీరాజ్యమునకు నిజమైన ప్రభువు. గతించిన, శూరబాహు మహారాజపుత్త్రుఁడగు వీరబాహుఁడే యీ బాలుఁడు చిత్రానామధేయంబుననున్న బాలికయే యీ వీరబాహుని మేనత్తకూతురగు శైలవతి. నేను నిజముగా మహర్షినిగాను. ఈబాలుని తల్లినగు సుశీలను.'' అని పల్కి కృత్రిమములగు తన మీసములను గడ్డముందీసివేసి యంగనయై నిలచి—తానొనరించిన కార్యముల నెఱిఁగించి, "మఱియు నో ప్రజలారా! ఈ బాలునివిషయంబున మీకు సంశయముగలదేని వీని నొసటంగల మచ్చను చూడుఁడు. బాల్యమున దీయఁబడిన వీని ఛాయాపటము గలదు. అందునయితము మీ కీమచ్చ కాన్పింపఁగల"దని పలుక ప్రజలందఱును జయజయ ధ్వానంబుల నొనరించి యాపడతి యొనరించిన మహాకార్యమును స్తుతించిరి. వీరబాహువు తల్లినిఁ గౌఁగిలించుకొని యానందాశ్రువులను రాల్చెను. పశ్చాత్తప్తుఁడైన కూరబాహుని క్షమించి, వీరబాహుఁడు శైలవతిని మహావైభవంబునం బరిణయమాడి యుత్కళరాజ్యమును చిరకాలము పరిపాలించెను.



## ఐదవనాటిరాత్రి కథ.

పంచమదివసంబున భాస్కరుం డపరవారాశి గ్రుంకినంతనే నరనారాయణులు రాత్రి భోజనంబొనరించు విలాసవైఖరి సంభాషించుచు, యథాపూర్వకంబుగ, యమునాసైకతభూముల విహరింపనరుదెంచి యట సుఖోపవిష్టులై తాంబూల చర్వణంబొనరించుతఱిఁ బ్రసంగవశంబున పార్థుం డధోక్షజుం దిలకించి—"యోదేవా! ఇంతకుమున్ను గడచిన యామినీచతుష్కంబునను, నాకు మనప్రమోదకరంబులగునట్టివియు—నిహపరోత్తారక హేతుభూతంబులగునట్టివియు నగు కథాచతుష్కంబును కర్ణరసాయనంబుగ నెఱిఁగించితివి. నేటిరాత్రి పంచమ యోగంబగు తారకరహస్యముం దెలుపు పుణ్యచరిత్రము నొకదాని నెఱిఁగించి, నన్ను ధన్యాత్మునొనరింపుము" నావుడు పురుషోత్తముఁడు మందస్మితముఖుండై—"విజయా! సావధానుండవై సుధాకర మహారాజు చరిత్రంబు నాలకింపుము. నీసంశయము తొలంగ గలఁదని పలికి, వెండియు నిట్లు పలుకసాగెను.

## సుధాకరమహారాజు కథ.

తొల్లి వంగదేశమును, పద్మాకరుం డనురాజు పరిపాలించుచుండెను. ఆరాజోత్తంసునకు, భారతి, విలాసవతియను నిరువురు భార్యలయందును క్రమంబున సుధాకర, ప్రభాకరులను పుత్త్రులు జన్మించిరి. రాజు కనిష్ఠసతీతిలకంబగు విలాసవతియందలి మోహంబు పెంపున నామె సవతి మత్సరంబున నొనర్చిన దుష్టోపదేశంబులచేఁ బ్రేరితుండై సాధ్వీతిలకంబగు భారతిని, నిరాకరించి, యామెను సపుత్త్రికంబుగ రాజమందిర బహిష్కృతనుగా నొనరించి, యత్యధమంబగు దినవెచ్చముం బంపుచు విలాసవతితో సుఖభోగములం గాలము గడుపుచుండెను. శుక్లపక్ష సుధాకరునిభాతి యువరాజగు సుధాకరుండును, దినదినప్రవర్ధమానుం డగుచు చతుష్షష్టికళలయందును, నష్టాదశ విద్యల యందును

వేదవేదాంత విచారాదులయందును సద్గుణసహస్రమునందును, సాటిలేని శక్తిం గలిగి, వృద్ధినందుచు నెల్లరచేఁ గీర్తింపఁబడుచుండ—తద్యశోగాన శ్రవణంబును భరింపఁజాలక, సవతితల్లియగు విలాసవతి యేవిధానంబుననైన నాబాలుని నాశనముంగాంచ నభిలషించి, కొండొకరేయి, శిరోబాధను నటింపుచు, నమూల్య రత్నాభరణాంబరాదుల విసర్జించి కోపాగారముం జేరియుండెను. వృద్ధరాజు యథాప్రకారంబున నిజసతీ సదనంబున కరిగి యామె విచారకారణంబునారసి, 'యేవిధానంబున నీశిరోబాధ శమియించు' నని ప్రశ్నింప, నాహంతకారి కొంత దురంతదుఃఖంబు నభినయించి, "యోరాజా! ఇది సామాన్యమగు శిరోబాధకాదు. ఇట్టి బాధ నాకు నాపుట్టింటనయితము బాల్యంబున నప్పుడప్పుడు కల్గుచుండెడిది. ఇందులకు శార్దూలక్షీర మౌషధంబు; నీ పెద్దకుమారుఁ డగు సుధాకరుఁడు దానిని గొనిరాగలసమర్థుండు; మఱియొకమానిసి కది దుస్తరంబగును. వానినంపి నేఁ గోరినపులిపాలు తెప్పింతువా బ్రదుకుదు; లేదా—నేటితో మనఋణానుబంధ మంతంబగు" నని పలికి కపట దుఃఖంబు నటించెను. రాజునకు మనస్సు ద్రవింప, సుధాకరుంబిలిచి, "నాయనా! నీపినతల్లికి దుర్భరశిరోబాధ గల్గియున్నది. అందులకు పులిపా లౌషధంబట. దానిం గొనివచ్చుటకు నీవే సమర్థుండవట! పులిపాలందెచ్చి, నీతల్లిప్రాణంబులను నిలుపుదువే తనయా!" యనియడుగ, నాపుత్త్రరత్నం బత్యంతవినయంబున నల్లేయని పలికి, నిజజననితో తన ప్రయాణోదంతముం జెప్పెను. పిడుగడచినట్లు వినంబడిన పుత్రునివాక్యంబులకు కొంతవడితెచ్చవడి భారతి మహావిషాదచేతస్కయై:-"కుమారా! ఇది మహాకపటోపాయము. నీసవతితల్లి నీమరణముంగోరి యిట్టి దురుపాయంబు నరసినది. రాజును చెంగున ముడివేసికొని మన కిట్టిదుర్దశను గలిగించుటతోఁ దృప్తినందక, నామహామారి మననాశనమును నయితమపేక్షించుచున్నది. ఎచ్చటనైన శిరోబాధకు పులిపాలౌషధంబులగునా? పులిపాలం దేదలంచుట మృత్యుదేవతా కరాళములం జొచ్చు

టయేకాదా? నాతండ్రీ! సాహసించిచని నాకు పుత్రశోకముం గలిగింపకు" మని మఱి మఱి దుఃఖించి వారింపఁజూచినను, సుధాకరుండు సమ్మతింపక తల్లిని యుక్తివచనంబుల ననుమతింపంజేసి, నిరపాయంబుగ వచ్చెదనని పలికి యానాఁడే పయనంబై చనియెను. అంతనాసాధ్వి చేయునది లేక కుమారుని మనఃపూర్వకంబుగఁ గౌఁగలించి చెక్కిలిముద్దాడి, దీవించిపంపెను.

యువరాజగు సుధాకరుండు పులిపాలనుసేకరించు నుద్యమంబున బయల్వెడలి, యొక మహారణ్యమునం జొచ్చి, యందుఁగలయాటవికులతోఁ దనవృత్తాంతముంజెప్ప వారు పకపకనవ్వి పరిహసించి, "యో వెఱ్ఱివాఁడా! పులులనెన్నింటినేని, భుజాసారము పెంపున బోకార్చినఁ బోకార్ప నలవి యగుంగాక—ప్రాణములతోడ, ఈనిన శార్దూలముంబట్టి, పాలు బితుక నెవ్వనితరంబు. నీకింతయేని ప్రాజ్ఞతచాలకపోయెనా? ఏమని తలంచి యీ సాహసకార్యముం దలదాల్చివచ్చితివి. బ్రతుకఁ దలంపు గలదేని సత్వరంబున మఱలిపొమ్ము. నీకిది కర్జంబుగా"దని పెద్దగామందలించిరి. సుధాకరుం డాయెఱుకలనిరుత్సాహవచనంబులను వినియు వెనుదీయక, నలువురం దనవెంట తోడుదీసికొని, భయంకరారణ్యమునం బ్రవేశించి,యనేకశార్దూలంబుల ప్రాణములం బొరిగొనియెనే కాని, సజీవశార్దూలమును డాయునుద్యమంబుఫలింపదయ్యె—అంత నా రాజపుత్త్రుఁడు మిగుల నిరుత్సాహముంజెందియే తదరణ్యంబున, నున్మత్తునిభాతి సంచరించుచు విధివశంబున, నాకాననలోనున్న శరభృంగమహాముని యాశ్రమముం బ్రవేశించి తన్మునిని దర్శించి, సాష్టాంగదండప్రణామంబుల నాచరించి తనచరిత్రంబు నామూలచూడముగ నెఱిఁగింప నాసంయమి మందస్మితవదనారవిందుఁడై యాతని నాదరించి దగ్గర గూర్చుండఁబెట్టుకొని, "యోకుమారా! నీసవతితల్లి నీపై నీర్ష్యపెంపున నిట్టికపటోపాయముం బన్నెనేకాని పులిపాలు నిజముగా నెవ్వరికిని లభ్యములుగావు. నీ వీనిష్ఫలప్రయత్నంబునుమాని కొన్నినాళ్లు నాయాశ్రమంబుననుంటివేని, నీ కిహపర సుఖమార్గదర్శకంబగు సదుపదేశంబొసరించెద" నని

పలుక నారాజపుత్త్రుం డమితానందపరవశుండై యట్లయగుంగాక యని సమ్మతించెను. అంత నాశరభృంగుండు సుధాకరునకు తారకంబును వినుమని యుపదేశించెను.

తదనంతరంబా సుధాకరుండు కొన్నినాళ్లు శరభృంగమునీంద్రు న్నాశ్రమంబునందుండ, నొకదినంబున, సుదాముం డనునామునీంద్రశిష్యుం డొకండరుదెంచి యాకుమారుండు నిర్మలమానసంబుననున్నతరి దరిం జేరి—"యోరాజకుమారా! నేను, కాశీ గయాది పుణ్యక్షేత్రంబులను దర్శించి వచ్చినవాఁడను. నాసంచారకాలంబున నందం దనేకచిత్రంబుల బొడగాంచితిని. అన్నిటిమాటకేమిగాని, కాశీపురాధిపతి కొకతనూభ వగలదు. ఆమె కనకాంగియను నన్వర్థనామంబున నొప్పారు. ఆ మంద యాన యందంబువర్ణింప వేనోళ్ల చిలువరాయనికిఁగూడ నసాధ్యంబగు ననిన, నీక నను బోటి చాందసుం డెందులకుఁజాలును? ఆసతీరత్నము సౌందర్యమునెదుట రతియు, భారతియు, శ్రీసతియు, హైమవతియు దిగదుడుపనకైనఁ బనికిరారనిన నీక భూలోకకాంతలమాట చెప్పనేల? ఇట్టిసంపూర్ణసౌందర్యరాశిని సృజించిన విరించి మతిమాలి, యానాతికొక తీరని కళంకముం దెచ్చిపెట్టినాఁడు. పవలుపంద్రెండు గంటల కాలమును నారాజకుమార్తె దుర్భరదురంతమగు నుదరబాధచే బీడింపఁబడుచు, నున్మత్తగతిం బ్రలాపించుచు, నిలాతలంబునఁబడి గిలగిలఁగొట్టుకొని పెద్దపెట్టున నెలుంగెత్తి దిశలుమారుమ్రోగ శోకించుచుండును. తత్సమ యంబున నామె శోకమునుగాంచిన రాతిగుండెలైన నవనీతంబులగతి మృదుత్వముందాల్చును. రాత్రులం దాబాల గాఢంబుగనిద్రించి వేకువ జామున శోకారావంబులతో మేల్కొనును. రాత్రులందాబాలిక శయ నించు మందిరంబున నెందఱు శయనింతురో వారందఱు తెల్లవాఱునప్ప టికి మృతశరీరులై యుందురు. ఈ మహాదారుణకార్యమునెఱింగి యొంట రిగ నాబాలిక నొకగదియం దిడి కవాటమును బంధించుచున్నారు. ఉదరబాధవలన నాబాలిక యన్నపానీయంబులను మఱచి శుష్కిం

గిట్టమై పోయినది. తొంటి సౌందర్యమెల్ల క్షీణించి శవప్రాయమై యున్న యది. జనకుండగు కాశీరాజు, పుత్రికబాధను నివారించినవారి కామె నిచ్చి పాణిగ్రహణంబు సల్పుటయేగాక యర్ధరాజ్యంబు నొసంగెదనని, ప్రకటించి యాబాలికరూపపటంబులం బంచిపెట్టుచున్నాడు. ఇయ్యది యే తత్ప్రతిరూపంబగు పటము. కామినీతృష్ణయు రాజ్యతృష్ణయు బ్రోత్సహింప ననేకు లీప్రయత్నంబునొనరించి మృత్యువువాతంజిక్కిరి. సుధాకరా! ఈకన్యక నీకెంతయుం గూర్చునది. దేశికుల యాశీర్వచనంబు నంది నీవరిగినచో—నసాధ్యంబుగానేర”దని ప్రోత్సహింప, సుధాకరుండా కాశీరాజపుత్రిక రూపపటముం దిలకించి, మన్మథబాణాహతుండై — నిట్టూర్పులునిగుడ్చి యెట్లైన నాయెలనాగపాణిని గ్రహింప సిద్ధసంకల్పుడై శరభృంగమహర్షి పాదములంబడి యాయుదంతంబు నెఱిఁగించి పెద్దతడవు ప్రార్థించెను. మునినృపుండా రాజకుమారుని మనఃపూర్వకంబుగ నాశీర్వదించి “కుమారా! పోయిరమ్ము నీకు జయంబగు” నని దీవించి చేయదగిన విధానంబెల్ల నుపదేశించి పంపెను.

అంత నాసుధాకరుండు, మర్త్యాకృతినిఁదాల్చి యిలకుడిగ్గిన సుధాకరుఁడోయన, గాశికాపురంబునకరిగి, యారాజోత్తముఁడగు బింబసారునిదిలకించి నమస్కరించి తానరుదెంచిన కార్యంబు నెఱిఁగించెను. అదివిని, యారాజుహాసించి,“బాలకా! నీవుమిక్కిలిపసివాఁడవు. నీసౌందర్యమును తలంచినదారుణసంకల్పమును నూహించిన, నాకుమిగుల విచారంబగుచున్నది. వల దుడుగుము. నీకన్ననతిసాహసంబునవచ్చినవారెందఱో మృతినందిరి. ఈయత్నంబునుమాని గృహంబునకరిగి సుఖింపుము.” అని పలికెను. ఐనను, సుధాకరుఁడు తనపంతంబుమానక యుంట నాయిలరేఁడు చేయునదిలేక, సమ్మతింప నారాజకుమారుఁడు పవలెల్ల నాబాలిక యనుభవించిన దురవస్థగని తద్దయుంజింతించి, రాత్రికాలంబున నాబాలిక నొంటరిగనుంచిన మందిరంబునఁదానును రాజానుమతంబునఁ బ్రవేశించి, కంటిపై ఱెప్పవ్రాల్పక నిశితఖడ్గపాణియైనిలచి

తారకమంత్రజపం బొనరించుచుండెను. రాత్రియంతయు నాబాలికగుఱ్ఱు
మనుధ్వనులు దిశలం జెలరేగ గాఢముగ నిద్రించుచుండ సుధాకరుం డామం
చయాన యుండంబు ననిమిష లోచనములఁగాంచుచు విధివిపరీతంబునకు
విచారించుచుండెను. అర్ధనిశీథం బతిక్రమించిన పిదప నాబాలిక నాశికారం
ధ్ర యుగళమునుండి రెండు క్రూరవిషసర్పంబులు బయలువెడలి యగ్ని
జ్వాలాయమానంబులగు విషజ్వాలలం గ్రక్కుచు నాతనిపై పయింగపసి
నంత, నాధీరుఁడు పరాక్రమించి యొక్కపెట్టున నావిషసర్పంబులం బరి
మార్చి, యాబాలికను సంరక్షించిన మహానందంబునందియు, మరలనింకే
యుపాయంబుమూడునోయను సంశయంబున శేషయామినింగూడ నిద్రా
వివర్జితుండై కాలముంబుచ్చెను. ఇంతలోఁ బ్రభాతంబగుటయు నాబా
లిక "దాహముదాహ" మని నిద్రలేచి పలువరింప నాతఁడు స్వహస్తం
బులతోఁ బానీయంబునొసంగ నాకన్యారత్నము స్వీకరించియు దేదీప్య
మానసౌందర్యముతో భాసిల్లు పరపురుషుని సన్నిధిని తానొంటరిగ
నుంట నెఱింగి లజ్జాభరంబున మేలిముసుంగు సవరించుకొన దొడంగెను.
ఇంతలో నారాజపుత్రుడు మృతినంది యుండునని తలంచుచు రాజదంప
తులును రాజుసేవకులును పౌరజనంబులును నటకరుదెంచి, రాజపుత్రుఁడు
సజీవియై యుండుటయు, రాజపుత్రిక నిరామయ యగుటయుం గాంచి
విస్మితులగుచుండ సుధాకరుండు జఱిగిన సంగతిం దెలిపి, యా సర్పఖండ
ములం జూపెను. అంత నాకాశీపురాధిపతి మహానందంబున వారిరువు
రకును బరిణయంబొనరించి, యర్ధరాజ్యంబు నొసంగి కతిపయసేనాసమూ
హంబులతోడను నమూల్యంబులగు నరణంబులతోడను కూతు నత్తింటి
కంపెను.

నిజభార్యాసమేతుఁడై నిజరాజధానికరుగు సుధాకరుండు మార్గ
మధ్యంబున శరభంగాశ్రమంబున కరుదెంచి, యామునికి నమస్క
రింప నాతఁ డాదంపతులను దీవించెను. అంత నాభూపతి నందనుం డట
కొన్నినాళ్లువసించి యొకనా డేకాంతంబున మునీంద్రునిగాంచి "ముని

తిలకా! తావకాశీర్వచన ప్రభావంబున నాకింతవఱకు శుభంబుగలిగె; కాని—నేనువచ్చినకార్యంబును నెరవేర్చుకొనక యేమొగంబున నింటి కరిగి నాతలిదండ్రుల మొగంబులు చూతు" ననిపలుక, నామునినవ్వి "రాకుమారా! నీకిది యేమివెఱ్ఱి? ఎవ్వరైనఁ బులిపాలు తేగలరని నమ్మచుంటివా? ఇది నీపై విరోధంబున నీ సవతితల్లి యొనరించిన కపటము. కావున నీ వాయత్నంబు మానుకొని స్వభార్యతో నిజరాజధాని కరిగి పట్టాభిషిక్తుండవు గ"మ్మనిన నాసుధాకరుం డందుల కామోదింపక— "మునీంద్రా! తమ యాశీర్వచన బలంబున పులిపాలను నిమిషమాత్రంబున సాధింపఁ గలనను ధైర్యము నాకుఁగలదు. నన్నేల నిరుత్సాహ పఱచెదరు. రిక్తహస్తంబులతో, నే నింటికరుగఁజాల" నని పలుక నాతని మనోనిశ్చయంబున కాముని మిగుల నానందించి "కుమారా! నీవు ధైర్యశాలివి; విజయమందఁగలవు. ఈ యత్నంబునఁ గూడ తారకమంత్రమే నీకు శరణ్యము; తారకమంత్ర పఠనం బొనరించుచుండు నీకు సమస్త క్రూరజంతువులును వశ్యంబులగును. దానం జేసి సులభముగా నీవు పులిపాలను సేకరింపఁగలవు. పోయిర"మ్మని దీవించి పంపెను.

అంత నారాజనందనుఁడు నిజదారా పరివార సమేతంబుగ నొక భయదాటవిం బ్రవేశించి యచ్చటి శార్దూలముల యెదుట నిలచి తారకమంత్ర జపంబొనరింప నవి మంత్రబద్ధ భుజంగములట్లు వశీకృతంబులై పోవ వలసినన్ని క్షీరముంగొని నిజరాజధాని కరిగె సుధాకరుఁడు పులిపాలకై చని మృతినొందెనని శోకించుచున్న నిజ జననీజనకులకు మనఃప్రమోదముం గలిగించెను. విలాసవతియు పశ్చాత్తప్తయై తొంటి వైరమును మఱచి యాదంపతుల నాదరించెను. అనంతరము బహుకాలము వఱకును సుధాకరుఁడు కనకాంగితో సుఖించుచు రెండు రాజ్యంబులను సోదర సహాయంబున నేకచ్ఛత్రంబుగ బరిపాలించి పుత్రపౌత్రాభివృద్ధింగల్గి వర్ధిల్లెను.

---

## ఆఱవనాటిరాత్రికథ.

ఆఱవనాటిరాత్రియుం బూర్వోక్తప్రకారంబా విజయాచ్యుతులు యమునానదీతటంబునం దాసీనులైన తఱి నర్జునుఁడు "బావా! నీదయారసంబున నిప్పటికి, ముముక్షుమార్గబోధకంబులగు ధర్మంబుల నైదింటిని నాకర్ణించితిని. నేటిరాత్రి యాఱవదియగు, సచ్చిదానందంబు నెఱిఁగింపుము నావుడు భగవంతుఁడు బావమఱఁదికిట్లనియె. "ధనంజయా! సచ్చిదానంద తత్త్వబోధకంబగు, కామవర్ధన మహారాజుపుణ్యచరిత్రంబు గల దద్దానిని నాకర్ణింపు"మని యాచరిత్రంబు నిట్లని చెప్పదొడంగెను.

# కామవర్ధన మహారాజుకథ.

మున్ను కాంభోజదేశముం బరిపాలించు కీర్తివర్ధనమహారాజునకు కామవర్ధనుం డను నాలిగేండ్ల కుమారుఁడుగల్గి, ధర్మపత్ని యగు విపులాదేవి గర్భవతియై యున్న శుభకాలంబున విధిచాలమింజేసి, శత్రురాజులు దండెత్తివచ్చుటయు నారాజన్యుఁడోపినంతవట్టు వారితోరణంబొనరించి, తుదకు పోరంజాలక గర్భవతియగు విపులాదేవితోడను, కుమారుఁడగు కామవర్ధనునితోడను, శాంతయను నొక దాసితోడను దుర్గాంతర్భాగ నిర్మితంబగు గూఢమార్గంబునంబడి, పాదచారులై విదేశముల కుంబారిపోవ శాత్రవులు నిరభ్యంతరముగ దుర్గంబునాక్రమించిరి. అట్లు గాఢాంధకార సాంద్రంబగు నాగుహాలోన, మున్ముందు రాజును, ఆవెనుక, కామవర్ధను నెత్తికొనిన శాంతయు, నందఱికన్న వెనుక గర్భభరాలసయగు విపులయు నడచుచుండ, చిమ్మచీఁకటిలో మార్గముంగానక, విధివశంబున నాగుహాలోనంగల మూఁడుదారులంబట్టి ముగ్గురును జనిరి. కామవర్ధనునెత్తుకొని చనుచున్న శాంత పెద్దపెట్టుననెలుంగెత్తి రాజును రాణినిం బిలిచిపిలిచి వేసారుచుండ నాగుహ ప్రతిధ్వనులనిచ్చుటదప్ప కార్యంబు గలుగదయ్యెను. అంత నాదాసి యాశోపహతయై యాహార నిద్రాదులులేమి సొమ్మసిలి యొక వృక్షచ్ఛాయను బాలునితో

నిద్రింపసాగెను. ఇంతలో నరుణోదయంబగుటయు నాకుమారుఁడు మేల్కాంచి, "యమ్మా యమ్మా" యని పిలిచి యేడ్చి, దాదివినా ధ్యుతరులం గానక వెంగటిల్లి తప్పడడుగుల నిడుచు మెల్లన దాదిని వదలి యా యడవిని కొండొకదూరము నడువ నొకచో నాబిఱు తని కోమలచరణంబున నొక నిశితకంటకము నాటుకొని రక్తధారలు గారఁ దొడంగెను. బాలుని శోకారావంబు నొక హనుమద్వానరం బాకర్ణించి, పరుగు పరుగున నరుదెంచి బాలుని పదకంటకంబు నూడ బెఱికి యొక వనౌషధిం దెచ్చి గాయంబుపై రుద్ది బాలునితో నాడు కొనుచుండెను. తత్సమీపంబుననేయున్న యొక గొల్లపల్లియ కధికారి యగు నానందుండనువాఁడు బాలుని, బాలునితో నాడుకొనువానరముం గాంచి యా కోతిని భీతనుగావించి పోఁద్రోలి, దిక్కులేక, ముద్దులుగుల్కు మోముతోనున్న కామవర్ధనునెత్తి ముద్దాడి, యనపత్యుండగు తనకీశ్వ రుండిచ్చిన బాలునిగా దలంచి వానికి హరిదత్తుఁడను నామంబునిడి, వాని మణిబంధమునంగల రక్షనుగాంచి దాని యాధారంబున బాలుని చరిత్రము నెఱుఁగవచ్చునను నాశతో పల్లెకుం గొనిపోయి వృద్ధురాలగు తన యవ్వ కిచ్చెను. ఆ యవ్వయు బాలు నతిగోమునఁ బెంచుచు, కాలక్రమంబున విజ్ఞానశీలుఁడగుచున్న యా కుఱ్ఱని కఖలరాజన్యుల చరిత్రంబులను దెలుపుచుండెను. ఆ పల్లెయందేయున్న యొక బ్రాహ్మణుఁడు హరి దత్తునకు తాఁ గఱచినంతవట్టు విద్యలను నేర్పినంత, హరిదత్తుం డంతట దృప్తినందక, సమీప పట్టణములనుండి, సద్గ్రంథములను దెప్పించుకొని, క్రమంబున స్వయంకృషిచే నఖలవిద్యలందునుఁ బాండిత్యం గాంచి యా పల్లెయందలి గొల్లపిల్లలకు రేడై పశుపాల నోద్యోగంబున నడవికంపఁబడి నపుడు, వారిని పరిపాలింపుచు, పెద్దలెఱుంగకుండ నాయడవిలో హరి దత్త సామ్రాజ్యము నొందు సంస్థాపించెను. కొన్ని దినంబులిట్లు జఱుగ, నావిపినంబునకు నేపాళదేశాధిపతి మృగయార్థమరుదెంచి, యొక వారము దినములందుండెను. ఆ తరుణంబున హరిదత్తుఁ డవ్వాకడకరిగి నేపాళాధీశుని

బిరుదంబు లెట్టివియో కనుంగొని, తన భృత్యులం గొందఱి—నపురూపా టవిక వస్తునిచయంబులతోడ నారాజుకడ కంపుచు నొకలేఖ నీక్రిందివిధం బున రచించెను.

"సముదారాతివిజయవిజృంభమాణభుజపరాక్రమక్రములును, నేపాలభూపాలోత్తములును నగు, ధనంజయరాజచంద్రులకు — హారి దత్తచక్రవర్తి స్నేహపూర్వకముగ వ్రాయు లేఖార్థములు—రాణ్మణీ!— ఇంతవఱకు మాయాజ్ఞనందక మాభూములకు మృగయార్థమరుదెంచిన వారు గానరారు. మీసాహసకార్యంబునకు మేమాశ్చర్యమునందినను, మీరు నూతనముగ రాజ్యమునకువచ్చిన బాలురగుటచే మేము మీ స్నేహమునుగోరి, మీకార్యము నొకతప్పుగా గణింపమైతిమి. ఇందు వెంట మీకుగొన్ని యపురూపవస్తువులను బహుమానముగఁబంపితిమి. స్వీకరించి చిరకాలము మాకుహితులై యుందురుగాక!—

ఇట్లు,

హారిదత్త చక్రవర్తి.

ధనంజయరాజీలేఖనుజూచి గుండెగొట్టుకొనియెను. అతఁడు నూతనముగ రాజ్యమునకువచ్చినందుననే యేం॰జు లెం దెందు పరిపా లించుచుండిరో యెఱుంగనివాఁడగుటను, హారిదత్త చక్రవర్తియను సంత కంబుండుటచేతను, తాను సామాన్యరాజమాత్రుఁడై తనకన్న నధి కుఁడగు నొకచక్రవర్తి కలుకగల్పించితినికాబోలునని తలంచి, యాబహు మానంబులస్వీకరించి వానింగొనిచనిన, యాదవబాలుని గొప్పగా బహూకరించి, యనర్ఘ్యమణిభూషణ చీనిచీనాంబరాదులను, అనేకపార శీకాశ్వములను పదియేనుఁగులనుబంపి క్షమార్పణపత్రికను వ్రాసికొని యెను. మఱికొన్నినాళ్లకు కళింగదేశపురాజు వేటకురాగా నాతనికిని వెనుకటియట్లే లేఖనురచించి, నేపాళరాజుచేఁబంపఁబడిన వానినన్నిటి నాతనికంప నాతండును వెఱగుపడి యంతకునాల్గురెట్లుగా నాతఁడు

బంపెను. ఈవిధంబున నటకు వేటకువచ్చిన ప్రతిరాజునకు ఒకరుపంపినవాని నౌకరికిపంపుచు నపారధనసంచయంబును సేకరించి, దానితో ప్రతిపట్టణ మునందును, హరిదత్తచక్రవర్తిపేర సత్రములగట్టించి యశేషకీర్తివిస్తారుం డయ్యెను. హరిదత్తచక్రవర్తి నెవ్వఁడు, నెఱుంగకున్నను, లోకమంతయు నాతని నెఱింగియుండెను. ప్రతిరాజునకు నాతఁడు మిత్రుఁడై యుండెను. రాజులెల్లఁ నాతనిగాంచ నభిలషించుచుండిరి. అంత నొకనాడు హరి దత్తునకు లోకసంచారంబొనరింప గోరిక వొడమ, తన బాల్యమిత్రుండగు వసంతునితో నాలోచించి, పెద్దల యానతినంది, యొక శుభముహూర్తం బున బయలువెడలెను. కతిపయదినంబులకా మిత్రద్వయంబును, విదర్భ దేశంబున కరుదెంచి యందు హరిదత్తుని సత్రంబున వసింప నా సత్రాధి కారి వారికి తైలాభ్యంజనస్నానమొనరించి, పంచభక్షపరమాన్న సహి తంబగు భోజనంబునిడి హంసతూలికాతల్పంబున శయనింపఁజేసి, పాద మర్దనంబునకు సేవకులను నియమింప నాతడాశ్చర్యమునందియు—తన్ను వారు గుర్తించియుందురా యని సందేహించియు, గల్లోలపడుచుండ వసంతుడది యెఱింగి పకపకనవ్వి—"మిత్రమా! ఈ సపర్యలు మనకే కాదు. అతిథులకందఱకును జఱుగుచున్నయవి. ఇట్లు మనము శాసిం చితిమి. నీవు మఱచి తబ్బిబ్బగుచుంటి" వని పల్కి యటఁగల హరి దత్త లిఖితంబులగు శాసనపత్రికలం జూపి సందేహావర్జితుం జేసెను. అట కరుదెంచిన యతిథులు తదీయ సత్కృతులకలరి, "భళీ హరిదత్తచక్ర వర్తీ!" యని కీర్తించువారును, ఆతనిపై పద్యములను కీర్తనలను గోడ లపై వ్రాసి చనువారును, ప్రత్యక్షముగ నాచక్రవర్తి దర్శింపఁగలవాఁడు కుబేరసమానుండుగాఁడేయని తలంచువారునై యుండ, హరిదత్తుం డిది యెల్లగాంచి మహానందపరవశుండై వసంతునితోఁగలసి యా దినంబున వాహ్యాళికరిగెను. విధిసంకల్పంబున నా యుద్యానవనంబునకే, యా విదర్భరాజనందిని యగు జగదేకసుందరియు—కూరిమి చెలియగు విలాసి నితోఁగలసి విహరింపవచ్చెను. ఆకాంత యందందువిహరించుచు, సంకల్ప

రహితంబుగ నాహరిదత్తుంగాంచి మించిన మారువిరాళికిలోనయ్యె. హరిదత్తుండును నాకన్యనుగాంచి, "యయ్యారే! ఇది మనుష్యాంగన యగునా? ఏనచో విధాతచాతుర్యము ప్రస్తుతిపాత్రముగదా" యని తలంచుచు మైమఱచి, యుండునంతలో సఖీప్రోద్బలంబున నామెలనాగ యచ్చోటువాసిచనియె. హరిదత్తుండంత చేయునదిలేక వసంతునితో మఱిమఱి యాబాలసోయగంబునే వర్ణించిచెప్పుచు సత్రంబునకరిగి మదనజరార్తుండై యారేయియెల్ల వేగించెను. ఇట జగదేకసుందరియు హరిదత్తుని రూపలావణ్యాదులనే విలాసినికి వర్ణించిచెప్పుచు "నోచెలియా! కంతుజయంత వసంతాదులనుమీఱిన జగన్మోహనరూపంబుతో నొప్పారు నాయందగాఁడెవ్వఁడే? అతఁడు నామనంబు నపహరించుకొనిపోయెఁగదే! అతని పొత్తుగూడని యాఁడుదానిజన్మమేలనే? యని జాలిగదుర బలుక, విలాసిని తననేర్పున హరిదత్తునియునికినెఱింగి, యాతనితోఁ బరిచయముచేసికొని చమత్కారముగ నాతనిహృదయంబును జగదేకసుందరిపై హత్తియుండుటనుగ్రహించి, "యోరాజకుమారా! నీవు కరుణింపకుఁడిన నాచెలిబ్రతుకు వట్టిదగును. ఇందులకొక నెఱవూహించితిని. ఇది గౌరవహీనంబనితలంపక నీవొకయాఁడువేసంబునఁ దొలుత నాయింటనుండుము. అటకు, శకటారూఢయై నాచెలి యరుదెంచ, మనమిఱువురముం జెలులభాతి నాశకటముపై నెక్కి, యూరివెలుపలంగల, లీలోద్యానమందిరంబున కరుగుదము. సాయంకాలముదనుక నందుసుఖలీలలందేలనగు పిదప మనము గృహంబునకురాగా రాకుమారి దివాణంబునకు జను"నని యుపదేశించి యదేవిధానంబున జగదేకసుందరీ హరిదత్తుల కనుదినమును సమావేశముం గల్గించుచుండెను. వసంతుఁడు తనమిత్రుని కార్యంబునెఱింగి, యిది ప్రమాదకరంబనియు, శీఘ్రముగ విరమింపుమనియు నెంతయో బోధించెఁగాని రాజపుత్రికాప్రేమబంధంబులం దవులొకొనిన హరిదత్తునిచెవి నామాటలు నాటవయ్యె. ఇట్లు కొన్నిదినంబులు గడువ నెవ్వరో—విదర్భ

రాజు పేర—"ఓ గుడ్డిరాజా! దినదినంబున నీతనయ, యొక్క వైదేశికుని తోడ నీలీలోద్యానమందిరమున మదనసుఖంబులఁ గాంచుచు సాయంకాలమున కింటికి వచ్చుచున్నయది. ఇది నీవు గుర్తింపకున్నావు. తెలివిగలవాఁడవేని తోడనే చని వానిని బంధింపు" మని సంతకములేని యొక లేఖను వ్రాసి పంపిరి. విదర్భాధిపతి యా లేఖం జదువుకొని తోఁక ద్రొక్కిన కాలాహిగతి నాగ్రహించి, యంతఃపురంబున కప్పుడే చని కుమార్తెజాడనారసి యామె నిజముగా లీలోద్యానమందిరంబున కరుగుట నెఱింగి మరింత యాగ్రహముతో నటకరుగ రాజురాకను దూరము నుండియే గ్రహించిన విలాసిని, రయంబున నరుదెంచి ప్రమాదంబువచ్చె నని రాజపుత్రు నొక నిగూఢనికుంజాంతరంబున దాచి యేమియు నెఱుంగని భాతి రాజపుత్రికతో పాచికలాడుచుండెను. ఆగ్రహముతో నటకువచ్చిన రాజు పరపురుషునెవ్వని నందుగానక, యప్పటికి చీఁకటులు దిశల నాక్రమించుటచే, నాయుద్యానవనమునుండి యెవ్వరిని బయటికిగాని బయటివారిని లోనికిగాని యుదయమువఱకుఁ బోనీయవలదని రక్షకభటులకు దీవ్రమైన యాజ్ఞనొసంగి యుదయంబున నా యంతఃపురద్రోహిని వెదుకవచ్చు, నెందుబోవుననితలంచి నిజకుమారీ సహితుఁడై నగరి కరిగెను. జగదేకసుందరి యా రేయి భోజనంబు నొల్లక, తన మనోహరున కెట్టి కీడుమూడునోయని యాక్రందించుచుండ విలాసిని యామె కొక యుక్తి నుపదేశించి, "రాజపుత్రికను పాముకఱచినదని" పెద్ద యల్లరిచేసెను. ఆ కోలాహలంబు నాలకించి రాజును రాణియు నశేష జనంబును నందుగుమిగూడి వాపోవదొడంగిరి. ఆస్థానమునందు పేరందిన వైద్యులందఱు మంత్ర తంత్రౌషధుల నుపయోగించి చూచిరిగాని యవియెల్ల బూదింజల్లిన పన్నీటివలె వ్యర్థంబులయ్యె. అంతవిలాసిని రాణితో "అమ్మా! నే నొకపాముమందు నెఱుంగుదును. కాని యది మన విలాసోద్యానంబునంగలదు. సాయంకాలంబున ప్రభువువారేలనో, తెల్లవాఱుదనుక బయటివారినిలోనికిని లోని

వారిని బయటికిని బోనీయవలదని యచటి భటులకాజ్ఞయిచ్చిరి. నన్ను మాత్రము వదలుటకు ప్రభువువా రాజ్ఞాపత్రికనొసంగినచో నీక్షణంబున నాయోషధింగొనివచ్చి నాచెలిని బ్రతికింపఁగల"నని పలుక, రాణి "యోసీ! ఇంతసేపటినుండియుఁ జెప్పవైతివేలనే? ఎట్లైన నాబిడ్డనుబ్రదికింపవే! ఆజ్ఞాపత్రమెంత? నిమిషంబున నిప్పింతు" నని పలికి, రాజుచే నట్టిపత్రికనిప్పించి విలాసినినంపెను. అంత నావిలాసిని వనపాలకుల కాశాసనముంజూపి, యథేచ్ఛగా లోనికరిగి రాజకుమారుంగలసికొని జఱిగిన సంగతింజెప్పి, యాతనికి తనవేషమువేసి బయటి కంపెను. రాజభటులావ్యక్తిని విలాసినిగాభావించి పోనిచ్చినంతం గొంతవడికి విలాసినియే వచ్చి వారికొకమూలికంజూపి "పోయెద"నని పలుక వారు విలాసినిని గుర్తించి, "యారా! మోసపోయితిమనిభావించి కన్నములోనిదొంగకు తేలుగుట్టినట్లు వాయెత్తనెఱచిరి. విలాసిని రాజపుత్రికకు మంత్రించునెపంబునఁ జెవిలో రహస్యంబుగ "రాజపుత్రుఁడు క్షేమముగ వెడలిపోయె" నని తెలుప నామె యారోగ్యశాలినియై యందఱ కానందముం గలిగించెను. హరిదత్తుఁడు వసంతునితో జఱిగినవిషయములం దెలిపి, "మిత్రమా! ఈయూర నింక నేనుండుట ప్రమాదకరము. కావున నే నందందు సంచరించి యొకమాసంబున కిందువచ్చెదను. అంతదనుక నీవిందుండి విలాసినివలన విషయంబులం దెలిసికొనుచుండు"మని పలికి యాతని నొప్పించి యొండేనింజనియె. అట్లు బహుదూరఁబరిగి హరిదత్తుం డొకనాటిరేయి యొకయరణ్యంబునంగల కాళికాలయంబున నిద్దురరాగా నట శయనించెను. ఆరాత్రి నడుజాముమీరినపిదప, నటకైదుగురుదొంగలు విశేషంబగు ధనసంచయంబుతో నరుదెంచి, తమలోఁదమకు పాళ్లుదెగక, కలహించుచు, నింతలో హరిదత్తుంగాంచి యాతనిపై గవయనెంచ, హరిదత్తుం డాగ్రహంబున విజృంభించి యాయేవురిని కాళికకు బలియిచ్చెను. అంతఁ గాళికాదేవి, యారాజపుత్రునకు బ్రత్యక్షమై— "యోరాజకుమారా! నీవు చాలనదృష్టశాలివి. ఈయేవురును ఏకగర్భ

జనితులగు బ్రాహ్మణసోదరులు; విధివశంబుననిట్లు చౌర్యపరతం దవిలి, మహాధనసంచయంబులగూర్చి యిందునిక్షేపించిరి. ఈయమావాస్యనాడు ఏకగర్భజనితులగు నేవురుబ్రాహ్మణులను నాకుబలియిచ్చిన పుణ్యాత్ముఁ డవుఁ బ్రసన్నమగుట నా కొకదీక్షగలదుగాన ని న్ననుగ్రహించితి. మఱియు, తద్ధనసంచయంబెల్ల నీకొసంగుటయేగాక, దేవమునులకైన నలవిగాని సచ్చిదానందమహాత్మ్యము నెఱింగింతు నాలకింపుమని సాంగముగవంచించె.

అనంతరం బాహారిదత్తుండు కాళికావరప్రసాదలబ్ధుఁడై తద్దత్త ధన నిక్షేపంబుల నందే, నిక్షిప్తపఱచి, కాళికపాదంబులకుమ్రొక్కి సెలవంది, భోజదేశంబునకరుగ, నట నారాజపుత్రికయగు చారుదత్త* కళ్యాణార్థ మారాజొకమత్స్యయంత్రంబునునిర్మించి, దానిని భేదింపఁగల శూరునకు చారుదత్త నిత్తునని ప్రకటించెను. హరిదత్తుం డావింతనుచూచి పోవలయు నని, యాయూరనొక పూటకూళ్లపెద్దమ్మనింటనిలువ, మార్గంబుననెందేనిం జను నొకదివాణపుదాసి, హరిదత్తుని నిదానించిచూచి, యానందముతో, "ఆర్యా! బహుకాలమునకు దర్శనంబిచ్చితిరి? ఎందేగితిరి? మీరు చెప్పకుండ వెడలిపోవుటఁజూచి, మా చెలి యగుచారుదత్త బెంగపెట్టు కొనియున్నది. మత్స్యయంత్రమునుభేదించి మీరు పరిణయంబగుదురని మాచెలి గంపెడాశతోనున్నది. అట్లు నావంక తెల్లపోయిచూచెద రేమి? నేను మీదాసినగుచతురనుగానా? సాయంకాలమున మాచెలి యుద్యానంబునకువచ్చును. దర్శనంబిచ్చెదరా?" యని యడుగుచుండ, హరిదత్తుండాశ్చర్యపడి, తన్నుఁబోలిన వానినెవ్వనిగనో యదిభ్రమించుచున్న దని తలంచి, తద్భావంబును బహిర్గతపరుపక, యప్పటికిం దగుసమాధానంబులనొసంగి దానినితృప్తిపఱచిపంపి, కాళికాకృపారసంబున నామత్స్యయంత్రముంగొట్టి, భోజరాజు నాతఁడే హరిత్తచక్రవర్తియని యెఱింగి మహానందమందిన చారుమతిం బరిణయంబాడుమనిపలుక తనలో, "అరరే! దాసిమాటలంబట్టిచూడ నన్నుబోలినవాని నొక్కని నింతకు

మున్నీ యెలనాగ కామించెనని తేలుచున్నది. అన్యాపహృతమానసియగు నీబాలను నేనెట్లుచేపట్టుదును? ఆపురుషుని నిక్కువంబరసి వానికే యీ బాలికనిచ్చుట కర్జం" బని తలంచి "యోరాజేంద్రా! నేనిప్పుడొక దీక్షయందున్నాను. మీతనయను సపరివారంబుగ నావెంటంగొనిచని, మాయింట వివాహంబాడెద, సెలవొసంగుఁ" డని పలుక నారాజు వల్లె యని అతనివెంట ప్రబలసేనను దాసదాసీజనులను, యమూల్యంబులగు కట్నంబులను నిచ్చి చారుమతితో బంపెను. అట్లు మహోట్టహాసంబున బయలువెడలిన హరిదత్తుండు కతిపయదినంబులకు విదర్భకరుదెంచి యూరిబయట బసలనేర్పఱచి, సత్రంబుననున్న వసంతునకు వార్తనంప నాతఁడరుదెంచి జఱిగిన వృత్తాంతంబెల్ల నాకర్ణించి, 'మిత్రమా! నీవిట నుండి చనినకొన్ని మాసములకు జగదేకసుందరి కొకదేదీప్యమానుండగు కుమారుండుగలిగెను. అంత నీయలరేడు లోకాపవాదంబునకు వెఱచి, నీపోబడినరయుతలంపున, నన్నుబిలువనంపి ప్రశ్నింప నీవేహరిదత్తచక్రవర్తి వనియు, నీవెచటనుండినదియు నే నెఱుంగననియు వాస్తవంబుఁ జెప్పితిని. అంత నారాజు నీవంటివాఁడు తన కల్లుఁడయ్యె కదాయని తనభాగధేయ మునుంగొనియాడుకొనుచు నీకై సమస్తదేశంబులకు వార్తలనంపెను. పుర జనులందఱును నీరాక కానందముతో వేచియున్నవారు. యాచకులు, బ్రాహ్మణులు, కవులు, దినదినంబును నాకడకువచ్చి నీచరిత్రంబునడిగిన దే యడుగుచు,విసుగుబుట్టించుచున్నారు. ఇది యిట్లుండ గొన్నిదినంబులకు పూర్వము, అచ్చముగ నీరూపురేఖలం గల్గినవాఁడును నీకన్న నొక్కింత చిన్నవాఁడును నగుయువకుం డొకఁడీపురంబునకు రాగా, విలాసిని యాతని జూచి నీవని భ్రమించి నిర్బంధంబున రాజనగరికిం గొనిపోయి రాజునకు రాజకుమార్తెకును జూపగా వారెన్నివిధంబులనో ప్రార్థించిరిగాని వాఁడు తాను హరిదత్తుఁడం గానని వాదించెను. అంత నేనాతనింగని, "రూపం బున నట్లేయున్నను ఇతఁడు నామిత్రుఁడు కాఁ"డని పల్కితిని. ఇప్పు డాతఁడు రాజప్రాసాదమునందే యున్నాఁడు. నీవుచెప్పిన భోజదేశ

వార్తలనుబట్టి చూడ, చారుదత్త వలచిన నీ రూపుగలవాఁడే యితండని తోఁచెడును. ఆబాలకు నెన్నివిధంబుల దఱచియడిగినను తన చరిత్రముం జెప్పక నిరంతర మెద్దియోవిచారించుచుండును. ఇక్కడి వృత్తాంత మిది" యని తెలిపెను. అంత, హరిదత్తుఁడు స్వపరివారము నందే యుంచి, వసంతద్వితీయుఁడై వెనుకటి సత్రంబునకరిగి, యందు వెనుకటి వలెనే ప్రచ్ఛన్నంబుగనుండ యథావిధంబున తైలాభ్యంజనం బొనరించు నెడ తలయంటుచున్న దాసి, హరిదత్తుని మణిబంధమునంగల, రక్షం గాంచి పెద్దగా నొక్కకేకవేసి, "హా! కామవర్ధనా! కామవర్ధనా! నాతండ్రీ! ఎన్నినాళ్ళకు గనఁబడితివిరా నాయనా!" యని పలుకుచు వెఱ్ఱిదానివలె గంతులువేయుచు, నానందాశ్రువులు వరదలై ప్రవహింప, మాటిమాటికి నాతని ముద్దిడుకొనఁ దొడంగెను—ఆదాసి విపరీతచర్యలు తనకర్థముగాక హరిదత్తుఁ" డవ్వా! నీకు వెఱ్ఱియెత్తినదా యేమి? ఇట్లేల పల్కెద"వని యడుగ, నాదాసి, తాను శాంతయగుటయు, వెనుక నష్ట విభవులై యాతని మాతాపితలును తానును గుహలోనుండి పారిపోవుచు వేరగుటయు నెఱింగించి—"నాయనా! ఆనాడు నేను నీతలిదండ్రులంగానక నీతో నొకవృక్షచ్ఛాయకువచ్చి శనివలెనన్నావహించిన నిద్రావేశంబున బడలినిద్రించితి. కొండొకవడికి లేచిచూడ నీవెందునుం గానరాకున్నంత నీ వేయడవిమృగంబుల వాతంజిక్కితివోయని దుఃఖించుచు, సకలపుణ్య క్షేత్రములందిఱుగుచుంటిని. నేటికి వింశతిదినంబులకుబూర్వము జగన్నాథ క్షేత్రమున నొకచోభిక్షమెత్తుకొనుచున్న నీతలిదండ్రులంగాంచి నీదుర్గతి నెఱింగింప వారుదుఃఖించి, మార్గమధ్యంబున నీజనని కొకపుత్రుండు గల్గెననియును వానినిపోషింపలేక, కాశీపురంబున విష్ణుపాదుఁడను నొక విప్రునకు పెంచుకొన నిచ్చితిమనియుం జెప్పిరి. ఇప్పుడు నీతలిదండ్రు లీసత్రంబుననేయున్నారు. రమ్మని—యాతనిం గొనిపోయి వారలంజూప— బహుకాలానంతరంబున సమావేశంబైన యాజననీజనకులయొక్కయు పుత్రునియొక్కయు, నందఱకన్న దాసియొక్కయు నానందము వర్ణనా

తీతంబై యుండెను. ఈలోన వసంతుఁడిక దాపనేలనని రయంబున రాజమందిరంబునకరిగి "మీయల్లుం డరుదెంచె" నని వారలకెఱిగించెను. హరిదత్తచక్రవర్తివచ్చె ననువార్త క్షణంబున నగరంబెల్లవ్యాపింప, నాబాలగోపాలం బాసత్రంబున నినుకవేసినరాలనట్లు నిండిపోయెను. విదర్భరాజు సాలంకృతంబులగు పట్టపుటేనుంగులపై మహావిభవంబున నల్లుని వసంతుని వియ్యంకుని, వియ్యంపురాలిని, నగరికింగొనిచని మహానందపరవశుం డయ్యెను. హరిదత్తుఁ డచ్చుముగ తనప్రతిచ్ఛాయంబోలి జనించిన కుమారునెత్తి ముద్దాడుచు నిజసతీమణికిని, విలాసినికిం బ్రియంబుచేకూర్చి, పిదప, తనవలెనేయున్న యాయువకుని గహస్యంబుగఁ బిలిచి, "నాయనా! నీవు నావలె నుండుట కేమికారణము నీ తలిదండ్రు లెవ్వరు? ఇక్కెలవచ్చితివి? నీచరితంబును దాచక నాకెఱిఁగింపు" మని యడుగ నాతఁడు, "రాజచంద్రమా! నేను నాకాశీపురంబునందలి విష్ణుపాదుండను విప్రునకు దత్తపుత్రుండను. నన్నే వ్వరో రాజదంపతులు బాల్యంబుననే యాతనికొసంగి చనిరట! ఆవిప్రుండు న స్మృతిగోపుడను పెంచి నన్ను స్వవిద్యావిశారదునిగా నొనరించినను నావిధి వక్రగతి నుండుటంజేసి యా విష్ణుపాదుని తృతీయకళత్రము, నాకు యౌవనారంభము వచ్చినంతనే, నాతోడి సుఖసంభోగంబు నభిలషించి నే నంగీ మతింపకున్నంత, చితాగ్నిఁబోలె రోషంబువహించి తన పతితో నాపై గొండెములు పలికి నన్ను గృహమునుండి వెడలనడిపించెను. అంత నేను నిరాధారినై యందందు దిరుగుచు, భోజరాజ్యంబున కరిగి యందొక యుద్యానవనంబున గూర్చుండియుండ నాదేశాధీశ్వరుని తనయ యగు చారుదత్తయు, సఖియగు చతురయు నటకు విహారార్థ మరుదెంచిరి. అంత నా చారుదత్త నన్నుగాంచి మోహావశయై చెలికత్తెచే నాయబారం బొనరింపంజేసి రేపటిసాయంకాలమున కిటకు మరల రమ్మని యట్లు నాచే బాసచేయించుకొని యానాటికి నన్నువదలి చనిరి. అయ్యది ప్రమాదకరంబని నేను భీతిల్లి యాపురంబును వదలి యిటకురాగా నిట" నీకే

హారిదత్తచక్రవర్తివని పల్కి నన్నీరాజన్యుఁడు నిర్బంధించె. కాని తమమిత్రుఁడు ననుఁగాంచి యీతఁడు హారిదత్తచక్రవర్తి కాడని పలికెను. నాటినుండియు నేనిందే యుంటిని ఇదియే నాచరిత్రం" బని పలుకహారిదత్తుఁడు (కామవర్ధనుఁడు) ప్రమోదబాష్పంబులు కన్నులంగారసోదరాయని యాతని నాలింగనముచేసికొని సర్వవృత్తాంతము నాతనికెఱిగించెను. ఈ విధంబున నష్టపుత్రలాభంబునందిన తలిదండ్రులగువిపులాకీర్తివర్ధలు పుత్రులం గౌగిలించుకొని పరమేశ్వరధ్యానంబు సలిపిరి. అంతట—హారిదత్తచక్రవర్తికిని జగదేకసుందరికిని, హారిదత్తసోదరుడగుకాంతివర్ధనునకును చారుదత్తకును కల్యాణంబు లనువార్త సమస్తదేశంబులకుం బ్రాకిపోయెను. చిరకాలమునుండియు హారిదత్తచక్రవర్తినిదర్శింపనభిలషించుచున్న సమస్తదేశాధీశులును దేశీయజనంబులును నేలయీనినచందంబున విదర్భాపురంబున కరుదెంచిరి. కామవర్ధనుఁడు కాళికాలయంబునదాచిన యశేషనిక్షేపంబు నర్థులకుం బరితృప్తికరంబుగ బంచియిచ్చి, మహావైభవంబున సోదరద్వితీయుండై కల్యాణంబొనరించుకొనుటయేకాక, విలాసిని నిచ్చి వసంతునకుఁ బెండిలిగావించి, తన్నుపెంచిన యాదవాధిపతియగు నానందుని నవ్వను, బాల్యమిత్రులను నటకుఁబిలువనంపి జగదానందకరుండయ్యెను. హారిదత్తుఁడే కామవర్ధనుండనియునాతని రాజ్యం బన్యాక్రాంతంబై నదనియు నెఱిఁగిన సమస్తదేశాధీశ్వరులును, కాంభోజదేశంబునకు దమసైన్యంబులతో నరిగి శత్రురాజుపైదండెత్త—నాతఁడు శరణాగతుండై రాజ్యంబునర్పించి తొలంగిచనియెను. ఈవిధంబున కామవర్ధనుండు, సోదరుఁడగు కాంతివర్ధనుని సహాయంబుననేకచ్ఛత్రంబున రాజ్యపాలనంబొనరించుచు, వృద్ధమాతాపితలకుంగన్నులచందమామయై యఖిలరాజమిత్రుఁడై—యాచకజనకల్పభూరుహంబై పుత్ర పౌత్రాభివృద్ధింగాంచి కాళికాకృపారసభాగ్యంబునబహుకాల మీభూతలంబున విలసిల్లెను.

---

## ఏడవనాటిరాత్రి కథ.

సప్తమదినంబునఁ గృష్ణార్జునులు యథాప్రకారంబుగ, యమునా తీరమున సుఖాసీనులై చల్లగావీతెంచు మెల్లనిపిల్లతెమ్మెరల సౌఖ్యంబున కలరుచున్నతరి, నర్జునుఁ డచ్యుతుంగాంచి "యోపురుషోత్తమా! నిన్నటిదినంబున నీవుచెప్పిన, కామవర్ధనుని చరిత్రం బతివిచిత్రంబు; పరమానందభరితుండనైతిని. సప్తమంబగు, సాకారమహాత్మ్యంబు నెఱిఁగించి ధన్యునిగావింపు"మని పలికిన, "పార్థా! సాకారప్రబోధకంబగు నీలకేతనమహారాజు చరిత్రంబుగల దద్దాని నాకర్ణింపుమని యిట్లువచింప దొడంగెను.

# నీలకేతనమహారాజు కథ.

తొల్లి పాంచాలదేశముం బరిపాలించుచుండిన సూర్యకేతనమహారాజునకు నీలకేతనుం డనునొకసుపుత్రుం డుద్భవిల్లెను. అంత నారాజు పుత్రోదయంబునకలరి దైవజ్ఞుల కాతనయుని జన్మపత్రికంజూప, నాయార్యులు గ్రహంబులనులెక్కించి "రాజా ఈబాలుఁడు మిగుల దుష్టకాలంబునం బ్రభవించె. వీనికి పదునాలుగేండ్లుమీరులోపల సూర్యరశ్మిసోకెనేని యనేక కష్టములంగాంచు"నని పలికిరి. సూర్యకేతనుఁడు దైవజ్ఞవచనానుసారంబుగ నాబాలుని నొకసూర్యరశ్మిసోకని పాతాళమందిరంబున నుంచి భద్రముగ గాపాడుచుండెను. ఆయనంతరంబున నారాజేంద్రునకు పాంచాలయను నొక తనయయు నుద్భవించె—ఇదియిట్లుండ దినక్రమంబున నా నీలకేతనునకు ద్వాదశవర్షంబులునిండ నాకుమారుఁడు బాల్యచాపలంబున నొకరేయి యామందిరంబువెల్వడి పురముంబాసి యొక మహారణ్యంబునంబడి చనుచు నిద్రావశంబున నొకశిలాతలంబున శయనించెను. దిన దినంబును భూతలంబునకు విహారార్థ మరుదెంచు యక్షపుత్రికయగు, కళానిలయ యనుసుందరి యాదినంబున నచటి కరుదెంచి, నీలకేతనుఁగాంచి మోహాపరవశయై యాతని నెత్తుకొని

యాకాశమార్గంబున యక్షలోకంబునకరిగి, నిజమందిరంబున నొక హంసతూలికాతల్పంబున శయనింపఁజేసి, నిద్దురలేపి తన యిష్టంబు నెఱింగించెను. ఆ పలుకులు విని, యా సుకుమారుం డాశ్చర్యభయచేతస్కుండై—"యయ్యారే! ఎక్కడి భూలోకము? ఎక్కడి యక్షలోకము? దైవజ్ఞులయానతిమీరివచ్చిన నా కిదియే కష్టారంభసూచకము కాఁబోలు" నని వాపోవుచుండ నా కళానిలయ యాతనికి ధైర్యంబు గఱపి వానితో సురతక్రీడాసుఖంబు నందుచుండెను. ఇట్లు కొన్నినాళ్లు రహస్యంబుగ నీవ్యాపారంబు జఱుగుచుండఁ దొలుత నామె సఖులయందు గుసగుసలారంభమై తుద కానోట నానోటంబడి, యక్షేశ్వరునకు దెలియ నాతం డాగ్రహోదగ్రుఁడై—యిరువురు భటులచే నాతని నిలాతలంబునకుఁ ద్రోయించెను. అట్లు త్రోయంబడిన నీలకేతనుం డొక యుద్యానంబునంగల పొదరింటంబడి, బహుతరోన్నతినుండి పతితుండైనకతంబునఁ బ్రాణంబులన్నుబట్టి మృతునిగతిం గదలమెదలక యుండెను. ఆ రాత్రి కాలంబున చల్లగాలి సుఖంబునకై తదుద్యానవనంబున శయనించిన, యొక రాజపుత్త్రికయు నామె సఖియు నాధ్వని నాలించి మేల్కాంచి, విస్మితులై—మన్మథుని ధిక్కరించు సౌందర్యంబునఁ విరాజిల్లుచు జచ్చినట్లు పడియున్న నీలకేతనుంగని జాలినంది పుష్పతల్పంబునఁ బరుండఁజేసి సపర్యలమేల్కొలిపిరి. రాజపుత్త్రుఁడు లబ్ధప్రాణుఁడై దిశలంబరికించి తొలుత నాకామినింగని, కళానిలయగా భ్రమసంది, మరలఁ గాదని గ్రహించి భయాశ్చర్యములతో—"ఓ కాంతలారా! ఇది యేదేశము మీ రెవ్వరు? నేనొక పర్వతమునుండి క్రిందబడినట్లు కలఁగంటిని. ఇది యింకను కలయేనా? కానిచో నేనిటకెట్లువచ్చితిని? నా కళానిలయ యేమయ్యె" నని వెఱ్ఱివానివలె నడుగ, నా కాంతలలో నొకతె—"యార్యా! ఇది కుంతలదేశము. ఈ బాల యీ దేశాధీశుండగు మణిమంతునిపుత్త్రిక—మణిమంజరియనం బరగు. నేనీమెసఖినగు సునందను. ఇందుమేము చల్లగాలికి శయనించియుండ నీ వాకాశమునుండి యిందు

బడినట్లనిపించెను. నీవృత్తాంతమేమి?" యని ప్రశ్నింప, నాతఁడు వెఱఁగు పడుచు, "ఓహో! ఇది భూలోకమా! అట్లయిన నేను యక్షలోకము నుండి, భూమికిఁ ద్రోయఁబడితిని కాఁబోలును. ఇంక నాకళానిలయమ్మై నాశవదలుకొనవలయునా?" యని వగవఁదొడంగెను. సునంద యాతని భీతిని బోద్రోలి యనునయించి, ఆతనియుదంతంబెల్ల నాతనినోటనే యాకర్ణించి, యొరులెఱుంగరాకుండ నాతని కాఁడువేసము వేసి, యంతిపురమ ననే యారేయి నిదురింపఁజేసెను. ప్రారంభమునఁ గొంత భీతిల్లినను, నీలకేతనుండు క్రమక్రమంబున భయవివర్జితుండై—తన్ను మనసార ప్రేమించిన నవలావణ్యవతియగు నామణిమంజరిం గూడి, సురతక్రీడల మెలంగఁదొడంగె. ఆమఱుసటిదినంబున నూతనకాంత యొకతె యంతఃపురంబున నుండుటం గాంచి పలువురు పలుతెఱంగులఁ బ్రశ్నింప సునంద ముందునకువచ్చి యాకాంత తనపినతల్లికూఁతురనియును గ్రామాంతరము నుండి వచ్చెననియు నదిమంచి విదుషీమణియనియు, నీలయను నామంబు గల్గినదనియు, రాజపుత్రిక కొన్నిదినంబులు దానిచెంగట విద్యాభ్యాస మొనరింపఁ గోరుచున్నదనియు వచించి యొక్కరును నోరెత్తి యాక్షేపించుట కెడములేకుండ నొనరించెను. నీలకేతనుండును స్త్రీరూపంబున నత్యంత మోహనాకారుఁడై స్త్రీపురుషులను సమానగతుల సమ్మోహింపఁజేయుచుండెను. సునంద పల్కిన చతురవచనములవలన భయము వీడి యా రాజపుత్రికా రాజపుత్త్రికులు, పవలెల్ల హాస్యోక్తులతోడను, విద్యావ్యాసంగములతోడను కాలముగడుపుచు రాత్రులందు హాయిగా నేకశయ్యాతలంబున శయనించి మదనవిలాసంబులచే నెలలు క్షణంబులుగా గడుపుచుండిరి. మణిమంజరికి మాణిభద్రుం డను నొకసహోదరుఁడుండెను. ఆబాలుఁడు సంప్రాప్తయౌవనుండయ్యును, సహోదరి వివాహంబుగాకమున్ను తాను పెండ్లాడఁగోరక కొంతయు, తనచిత్తంబునకు నచ్చిన బాలిక లభింపమిఁగొంతయు నప్పటివఱకవివాహితుండై యుండెను. సహజముగా నమ్మాణిభద్రుండు, తనరాకను మున్ముం

దుగా నెఱింగింపకయే తన సోదరియగు మణిమంజరి మందిరంబున కరు దెంచు నభ్యాసము గలవాఁడగుటచే నతఁ డొక్కదినంబున, మణిమంజరీ నీలలు సుఖోపవిష్టులై కొండొక శాస్త్రప్రసంగం బొనరించుకొను నవస రంబున, నకస్మాత్తుగ నటకరుదెంచెను. పరపురుషాగమన కారణం బున లజ్జాభయంబు లుల్లంబున మల్లడిగొన నీలతటాలున నభ్యంతరప్రదేశ మున కరిగెను. వినయంబు పెంపున గొంతయు, స్త్రీరూపంబున నున్నను సహజముగ పురుషుండగుఁ దనప్రియుండు సోదరుని కంటఁబడెనుగదా యను వెఱపున కొంతయు తన రహస్యము బహిర్గత మయ్యెనోయను సందేహాభయంబులఁ గొంతయు, మణిమంజరి యవనతముఖియై మెల్లన లేచి నిలువంబడెను. స్త్రీ రూపమును ధరించి యతిలోక లావణ్యంబున వెలయుచున్న యా నీలకేతను సౌందర్యముం గాంచి ప్రథమవీక్షణంబుననే, మదనశరాఘాత బాధితుండై–వెంటనే స్వకీయ మనోగతాభిప్రాయంబును బయల్పడనీయక, కొండొకతడవు స్వసహాజాతతోఁ బ్రసంగించి, ప్రసం గాంతరంబున—"చెలీ!! నీ యంతఃపురంబున కొక విదుషీమణి వచ్చె ననియు, నామె పాండిత్యంబున ననామాన్య యనియు వినియుంటిని. నేఁడు మనయాస్థానంబున కొకపండితోత్తముఁడు వచ్చి యాస్థానపండి తుల నశేషంబుగ తన మేధాలులవిశేషంబునకు విద్యావివేకంబు నను పరాజితులనుగా నొనరించి మఱియెవ్వరును లేరాయని ప్రశ్నించుచున్న వాఁడు; ఇప్పట్టున మన మోటమినందితిమేని సంస్థానగౌరవంబున కెంతేని కళంకము గలుగఁగలదు. తద్గౌరవంబును నిలువఁబెట్టగల భారము నీయందున్నయది. ఆపండితశిరోమణి నోడింపగల శక్తి నీచెలికిం గలదనిభావించి తండ్రిగారియనుజ్ఞపై నే నిటకువచ్చితిని. కావున సంస్థాన గౌరవమును నిలుపుకొఱకు నీ వామెను వాదంబునకు బ్రేరేపించి పంప తప్పదని పలికెను. సహోదరునిపలుకుల నాకర్ణించి మణిమంజరి యాత్మగతంబునఁ బెద్దయుం దడవు యోచించి, "యాతరుణితోడ నాలో చించి తెలియజేసెద" నని యాతని నప్పటి కెట్లో సమాధానపఱచి పంపి

వేసెను. యవనికాభ్యంతరమునుండి భర్తృదారికా భర్తృదారకుల ప్రసంగమెల్ల నాకర్ణించుచుండిన కాలకేతనుఁడు, దీనవదనుఁడై తనకడ కరుదెంచిన, యా మణిమంజరింగాంచి, "మంజువాణీ! నీ సోదరుం డాడినపలుకుల నెల్ల నాకర్ణించితిని. ఇప్పట్టున మన మెద్దియేని యభ్యంతరంబును వచించి నీ సోదరునిమనంబును చిన్నబుచ్చితిమేని మనల ననుమానింపఁగలరు. అందువలన బ్రమాదము వాటిల్లఁగలదు. అదియునుంగాక, విశేషించి, మనకు సంస్థానమర్యాదనిల్పుటయుఁ గర్తవ్యము. నే నాపండితుని యుక్తవిధంబున నోడించి, నామర్యాదకు భంగముకలుగకుండ, మనగుట్టుబయల్పడకుండ రాగలను. నీవిందుల కెంతమాత్రమును సంశయింపక నాసమ్మతి నెఱిఁగింపుమనిపలికెను. అంత నా మణిమంజరియు వల్లెయని యట్లయొనరింప నియమితకాలంబునందు కపటకాంతావేషదారియగు కాలకేతనుఁడప్పండితునితో చతుష్షష్టికళలయందును, ఛందోతర్కవ్యాకరణ మీమాంసాలంకారాదిశాస్త్రములయందును, అమోఘంబగు వాదం బొనరించి, యామమాత్రకాలంబునఁ బరాజితునిగా నొనరించెను. తద్వాదకాలంబున, నప్పండితుని సమక్షంబున రాజకుమారుండగు, మాణిభద్రుండును నాసీనుఁడై యుండెను. కాలకేతనుఁడు స్త్రీరూపంబున, త్రిలోకమోహనుండై కాన్పించుచున్నందున, నతఁడు నిక్కముగ కాంతయే యను భ్రమంబున, నాకపటకాంతయందు లయంబయిన చిత్తంబుతో నొడలునుఱచియుండెను. నాటి రాత్రికాలంబున, మాణిభద్రుడు నిద్దురపట్టక నిజశయ్యాతలంబునఁబడి దొరలుచు, తీవ్రతర మదన జ్వరపీడితుండై ప్రలాపించుచు నా కాంతాలలామంగూడు వెఱవెద్దియని వితర్కించి, తుదకు మణిమంజరిసఖియగు, సునందను జేరంజీరి, తనవిరహావస్థ నామెకెఱిఁగించి, యే యుపాయంబుననేని యాసతిం దనకుఁ గూర్చినయెడల గొప్పబహుమానం బొనరింతుననిపల్కి యామెచే నట్లనిపించుకొనియెను—సునందయు వ్యాకులచిత్తంబున మణిమంజిరి కడకరుదెంచి, "సఖీ! మన మొకటితలంప దైవమిం

కొకటి తలంచెను. నీప్రియుని స్త్రీరూపంబునంగాంచి, నీసోదరుఁడు మదన శరాహతుండై తల్లడిల్లుచున్నవాఁడు. ఎట్లయిన తనకుంగూర్పు మని నన్నువేఁడుకొనియె. అదియునుంగాక, నీయందు గర్భచిహ్నంబులు పొడసూపుచున్నయవి. కాలకేతనుఁడిక నిచ్చోట విశేష కాలముండిన ప్రమాదంబుగలుగఁగలదు. అతనిఁ గొంతకాలమెటకైనఁ బంపుట సర్వశ్రేయ" మని పలుక, నాబిబ్బోకవతి నిజప్రియ విశ్లేషంబున కోర్వనోపక పెల్లుగతల్లడిల్లి శోకింపసాగెను. తుదకు గత్యంతరముగానక, కాలకేతనుఁ డామె నెట్లో సమాధానపఱచి, వలయు ధనంబును, ఒకయుత్తమాశ్వంబును గైకొని యొకనాటిరాత్రి రహస్యమార్గంబున పురంబువెలువడి యెందేనిఁజనియె. మఱునాడు మాణిభద్రునికడ కరిగి మాలతి" భర్తృదారకా! తమయభిప్రాయంబును నే నాకాంత కెఱిఁగించితిని. అప్పటి కనుమతించినట్లే కాన్పించెను. కాని తెల్లవాఱునప్పటికెందో చనినది. మాయూరికిఁగూడ వార్తనంపితిని. అటనుండి జనినట్లు లేదు. ఎందుజనెనో తెలియ" దనిపలుక నారాజపుత్రుఁడు శోకహతుండై యక్కాంతనారయ నలువంకలకును దూతలనంపెను.

ఇదియిట్లుండనట——కాలకేతనుని జనకుఁడగు సూర్యకేతనమహారాజు, మఱునాడు పాతాళమందిరంబున, కాలకేతనుంగానక, పరితపించుచుండ, పుత్రికయగు పాంచాల, జనకునియనుమతింగొని, విశ్వాసపాత్రురాలగు తరళ యనుచేటినివెంటగొని, యిరువురును పురుషరూపంబులను దాల్చి——కాలకేతను నన్వేషింప దేశాంతరగతులైరి.

కాలకేతనుండట్లు—కుంతలరాజ్యంబువిడచి యొకమహారణ్యము బ్రవేశించి, మణిమాజరీవిశ్లేషంబున నవ్యాధీనమానసుఁడై——నారదమహర్షియాశ్రమముంబ్రవేశించి యామునిపాదకమలములంబట్టుకొని ప్రార్థించి, తనయుదంతమెల్ల నెఱిఁగింప నాతఁడునవ్వి "కుమారా! ఎంతవెఱ్ఱివాఁడవైతివి? అనశ్వరంబగు ముముక్షుమార్గంబు నెఱుంగక, హేయంబగు

నీమోహితచింతలందవిలి యెన్నినాళ్లిట్లు కూపస్థమండూకంబువోలె మెలంగి పతితుండవయ్యెదవు? నీకు మహాజనదుర్లభంబగు సాకార ప్రభావంబు నెఱిఁగించెదను. అందువలన నీవు తరింపఁగల” వని యుప దేశించె.

ఆనాడట్లు నీలకేతను నిలాతలంబునకుఁ ద్రోయించినపిదప యక్షేశ్వరుండు, తన తనయ గర్భవతియయ్యెనని యెఱింగి, పతికొఱకై సుత జెందు దుఃఖముంగాంచి, భరింపఁజాలక తుదకెట్లైన నాతనినే యన్వేషించి యల్లునిగా నొనరించుకొన నభిలషించి, యాతఁడు మానవుండని తన తనయవలన నెఱింగి, యామె వ్రాసియిచ్చిన నీలకేతనుని ప్రతిరూపంబులను చారులకిచ్చి భూతలంబున కంపెను. ఈలోపల సహోదరు నన్వేషింప దేశయాత్రగావించుచుండిన,పాంచాల పురుషాకృతితో, క్రమంబున, కుంతలరాజధాని కరుదెంచి పురుషరూపముతోనున్న సఖితో నొక సత్రంబున విడిసియుండెను. ఆ పురిరాజపుత్రికకు తలిదండ్రుల కెఱుకలేకుండ గర్భోత్పన్నమయ్యెననియు నీలకేతనుఁ డనునొక రాజ పుత్రుం డామెంగలసిన ట్లాంబుజపుత్రిక పచించుచుండెననియు రాజేంద్రుఁ డాతనికై వెదకించుచుండెననియు, సత్రాగత పౌరజనంబులవలన నాల కించి, యారాజపుత్రికతో మాటలాడదలంచి యుండెను. అనంతర మెందేని మార్గాంతరంబునం జనుసునంద యాసత్రంబున కరుదెంచి, తటాలునఁ బురుషాకృతితో నందున్న పాంచాలనుగాంచి నీలకేతనునిగా భ్రమించి వినయసంభ్రమములతో నాతం డగ్గఱి—నమస్కరించి— “రాజపుత్రా! ఇటకెప్పుడు వచ్చితివి? ఇన్నినాళ్లు నెందుంటివి? నాచెలి నీకై బెంగఁగొనియున్నది; రాజేంద్రుఁడు నీచరిత్రంబునంతను నాకర్ణించి నిన్ను జామాతనుగా స్వీకరింప నుద్యుక్తుఁడై యున్నాఁడు. ఈ సత్రం బున నుండనేల? రమ్ము—నాచెలికి నేత్రపర్వం బొనరించి రాజానుమతం బున పెండ్లికుమారుఁడవు గమ్ము—” అని త్వరపెట్టుచున్న సునంద పొరపాటునెఱింగి పాంచాల నవ్వి—“సుదతీ! నీవెవ్వతెవో నేనెఱుంగను;

బహుశః నీవు నాసోదరుఁడగు నీలకేతనుని వృత్తాంతము వక్కాణించు చుందును. నేనును నాసోదరు నన్వేషించుచు నిందు సంచరించుచున్నా" నని పలికి తాను కాంతయగుటయుఁ దన సర్వవృత్తాంతమును నెఱిఁగించి రాజపుత్రికను సందర్శించి సంభాషించుటకై—పురుషాకృతిని విడ నాడి నిజరూపముతో సునందవెంట రాజాంతఃపురమున కరిగెను.

కుంతలరాజకుమారుఁ డగుమాణిభద్రుఁ డానాఁడు స్త్రీరూపమున నున్న నీలకేతనుఁ గాంచినదిమొదలు, మదనబాణహతుఁడై పరితపించుచు, ననుదినంబును సునందతోఁ దనసంక్షోభముం జెప్పుకొనుచు నక్కాం జాక్షి మఱల నీపురి కెపుడువచ్చుననియడుగుచు దిన మొకయుగముగా గడుపుచుండెను. ఆదినమున మణిమంజరియు పాంచాలయు సంభాషించు నదనున, మాణిభద్రుం డటకరుదెంచి, పాంచాలంగని తావలచినకాంత యదియేయని భ్రమించె—పాంచాలయు నామోహనాంగునిగని కామ వశయయ్యెను. ఆయువతీయువకుల హృదయగతాభిప్రాయంబుల నెఱింగి, మణిమంజరీ సునందలు వారిరువురకును అన్యోన్యసంభాషణాను కూల్యముం గలిగించిరి. అప్పు డారాజపుత్రుఁ డాపుత్తడిబొమ్మ ననేక విధంబుల బ్రతిమాలి తన్ను బరిణయమాడుమని వేడుకొన, నాకాంత "ఆర్యా! నాసోదరునియునికి నెఱుంగునందాక నే నీశుభకార్యంబున కనుమతింపఁబోను. నేనాతని నన్వేషించి తెచ్చినపిదప, రెండు వివాహ ములు నేకకాలంబునఁ గాదగునని పలికి యాతనిననుమతింపఁజేసి, మరల నీలకేతను నన్వేషింపఁ బురుషాకృతితో, సఖీద్వితీయయై మఱియొక పురంబున కరిగెను. అట్లుచనిన పాంచాల యొకచో శయనించియుండ— యక్షేశ్వరునిచే నీలకేతన ప్రతిరూపపటసహితంబుగఁ బాపఁబడిన, చారులు పురుషాకృతితోనున్న పాంచాలంగని, నీలకేతనుఁడని భ్రమించి, స్వకీయమాయాబలంబున నిజలోకమునకుఁగొని చని, కళానిలయ శయ్యాతలంబున శయనింపఁజేసిరి. కళానిలయయు నాకాంతను గుర్తిం పనేరక నిజనాథుఁడేయని భ్రమించి నిద్దురలో ముద్దిడుకొని, పాంచాల

నిద్రాభంగమునంది యాకళానిలయ సంగతినంతనువిని, తాను నీలకేత నుఁడగానని పలికి నిజచరిత్రము నెఱింగించెను. ఆచరిత్రము నానుపూర్వ కముగ నాకర్ణించి—యక్షరాజపుత్రికయగు కళానిలయ, తద్వ్యక్తి తన హృదయాధినాథుఁడుగానందులకు విచారించియు, వధూనికాపరి చయ మయాచితముగగల్గుట కానందించి, సందర్భములనెల్ల యోచించి, "పాంచాలదేవీ! ఇందుగల యక్షయువకులు నీసౌందర్యముగాంచి రేని, మోహపరవశులై నిన్ను కడునిడుమలపాల్సేయక విడువరు; కావున నీవు స్త్రీరూపధారివిగాకుండ నీపురుషాకృతితోడనే భవత్సోదరు డిందువచ్చుదనుక వేచియుండుము; నాతండ్రిపనుపున మఱికొందఱు చారులు నీసోదరు నన్వేషింప నరిగిరి. వారెల్లన ననతికాలంబుననే వారి నిందుగొనిరాఁగల"రని హితంబువలుక, నామెవల్లెయని పలికి యక్షేశ్వరు నిచే సన్మానింపఁబడి జామాతంబోలె సర్వసౌఖ్యములం గాంచుచుండెను.

ఇదియిట్లుండ, నారదమహర్షి యాశ్రమమునందున్న నీలకేతనుని యక్షదూతలు చిత్రపటసహాయంబునగుర్తించి నారదసందర్శనంబొనరించి యక్షేశ్వరు నిర్దేశంబు నాసంయమి కెఱింగించి, యానీలకేతనుని దమ వెంటనిడుకొని యక్షలోకంబునకరిగిరి. యక్షరాజు నీలకేతనునిగాంచి యాశ్చర్యపడి చారులపై గుపితుఁడై "ఓరిమందమతులారా! వీఁడె వ్వఁడో కపటవేషధారి, మీరు వీనిమాయాజాలములందగులుకొంటిరి. నాయల్లుఁడు నాయింటికివచ్చి బహుదినంబులయ్యె; ఈకపటియెవ్వఁడో వీనిని కారాగారమున బంధింపుఁ"డని పలుక, నీలకేతనుఁడు తత్పరా భవంబు నోర్వఁజాలక, ప్రళయకాలరుద్రునిగతి మండిపడి, యక్షలోక మును భస్మీపటలంబుగావింప నుద్యమించుతఱి, కళానిలయ సర్వోదం తము నాకర్ణించి, సంభ్రమంబున నటకరుదెంచి యావత్కథను తండ్రి కెఱిఁగించి మున్ను జామాతగానున్నది నీలకేతనుసోదరియని తెలియజేసి, ప్రియునికేల్పట్ట నాయక్షపతి పశ్చాత్తప్తుఁడై యల్లునిక్షమార్పణముం గోరి కళానిలయానీలకేతనుల కతివైభవంబున గల్యాణంబొనరించెను.

కతిపయదినంబులు నీలకేతనుఁ డందుండ నాతనికొక పుత్రరత్నంబుదయించె. అంతట బాలునకతి విభవంబున జాతకర్మనామకరణాది శుభకార్యంబులొనర్పంబడియె. అంత నీలకేతనునకు మణిమంజరి స్మృతికి వచ్చుటయు నాతఁడు మామగారితో తదభిలాషముం దెలిపి నిజపుత్ర జాయాసహోదరీ కతిపయపరివారధనకనకసమేతంబుగ యక్షేశ్వరుం డొసంగిన పుష్పకంబునధిరోహించి కుంతలరాజ్యంబునం బ్రవేశింప నారాజేంద్రుఁ డాతనిరాక నెఱింగి పరమప్రీతినాతనినాహ్వానించి పర్వంబుగానానందించెను. అంతనొక శుభదినంబునఁ మణిమంజరీ నీలకేతనులకును, పాంచాలామాణిభద్రులకును కల్యాణంబులయ్యెను. కల్యాణానంతర మొక్క మాసంబునకే మణిమంజరి దేదీప్యమానయై వెలుంగు నొకకన్యకం బ్రసవించెను. అనంతరమానీలకేతనుఁడు, భార్యాయుగళమును, పుత్రికాపుత్రకులను వెంటనిడుకొని. సోదరితోడను, బావమఱఁదితోడను గదలి నిజరాజధానికరిగె. పుత్రవిశ్లేషంబునను జరాభారంబునను వ్యాధిశయ్యాగతుండైన సూర్యకేతనమహారాజు నిజకుమారాగమనంబుల కలరి, రాజ్యభారంబు నాతనిపై నిడి తాను వానప్రస్థాశ్రమ స్వీకారంబొనరించె. నీలకేతనుండును బహువర్షములు రామరాజ్యముంబోలి ప్రజాపాలనం బొనరించి సత్కీర్తిగణించెను.'' అని శ్రీకృష్ణుం డర్జునున కెఱిఁగించెను.



# ఎనిమిదవనాటిరాత్రి కథ.

నరనారాయణావతారధారులగు కృష్ణార్జును లిరువురును వెను కటివలెనే—యెనిమిదవనాటి సాయంసమయమునసయితము,మృష్టాన్న భోజనం బొనరించి యమునా సైకతస్థలంబుల విహరింప నరి యి—యందొక్క మనోహరస్థలంబున సుఖాసీనులై తాంబూల చర్వణంబొనరించు నవసరంబున, పార్థుఁడు పద్మనాభు నవలోకించి, "యో జగన్నాథా! గతరాత్రిమున, నీవు దయతో నెఱిఁగించిన నీలకేత నుని చరితము పరమాశ్చర్యభరితము. ఎనిమిదవదియగు నిరాకార తత్త్వంబు నుపదేశించి కృతార్థు నొనరింపు" మని పలుకుటయు, నయ్యదునందనుఁడు మందస్మితవదనారవిందుఁడై "కిరీటీ!—జీమూత వాహనమహారాజు చరిత్రముం జెప్పెద; నాకర్ణింతువేని నీ సంశయము వాయు" నని పలికి—తచ్చరిత్రము నిట్లు వచింప దొరకొనియెను.

# జీమూతవాహనమహారాజు కథ.

విజయా! తొల్లి కాశ్మీరదేశంబును పరిపాలించుచుండిన మయూర వాహనమహారాజు మహాపతివ్రతియనందగు "అపర్ణాదేవిని" భార్యగా వరసియు నామువలన చిరకాలము సంతతింగానక వెసగి—వృద్ధాప్యం బున "విపుల" యను నొకకన్యకం బరిణయమాడెను. విపుల నవ యౌవనవతియగుటంజేసి—వృద్ధనాథుని మనంబుననొల్లక మిగుల నేవ గించుకొనుచుండెను. ఇదియిట్లుండ నప్పటి రాజసచివుఁడు వృద్ధుఁడై మృతినంద, నాతనికుమారుఁడగు చారుదత్తుఁడు మంత్రియయ్యెను. చారుదత్తుఁ డనన్యసౌందర్యప్రభావిభాసితుండగుట, విపులాదేవి యాతని యం దనురక్తయయ్యెను. కొండొకదినమున మాండవ్యుఁడను నొక యోగిసత్తముఁడు రా జాస్థానంబునకువచ్చుటయు రాజసచివు లిరువురు నా యతీంద్రుని విధ్యుక్తవిధానంబునఁబూజించి సంతానప్రాప్తికిఁ గొం

డొక వెలవెలఁగింపవేడిరి. అయ్యతి వారిననుగ్రహించి వారిభార్యల నటకురప్పింపఁగోర—పట్టమహిషియగు నపర్ణాదేవియు, మంత్రిభార్య యగు వీరబాలయు సత్వరం బరుదెంచిరిగాని, విపులాదేవి శృంగారపరి పూర్తిఁగావించుకొని యేతెంచుటకు జాగయ్యెను. ఈలోన నాయతి, యపర్ణావీరబాలల నిరువుర నాశీర్వదించి వెడలిపోయెను. అనంతర మటకరుదెంచిన విపుల కార్యముమించినందులకు వగచుచు, నపర్ణాదేవికి పుత్రప్రాప్తిగలుగనై యుండుటకు మానసంబున నీర్ష్యాపూరితయై యుం డెను. అనతిదినంబులకే రాజమంత్రులదారలు గర్భవతులై పతులతో పాటుగ సర్వరాష్ట్రవాసులకును బ్రమోదముఁగల్గించిరి. మంత్రి యగు చారుదత్తుని వలచిన విపుల రాజాజ్ఞగావార్తనంపి యొకదిన బున, చారుదత్తుని దనయేకాంతాగారమునకు రప్పించుకొని, తనవలపుం బ్రకటింప నాతఁడప్పాపకార్యంబున కియ్యకొనడయ్యె— ఇంతలో విధివశంబున నటకు ధరాధిపుం డరుదెంచుటయు—కార్యము తప్పి వచ్చెనని గ్రహించి విపుల చిత్రాంగివోలె—హారంబువహియించి, తానొనర్పనెంచిన పాపకార్యంబును మంత్రియే యొనరింపనెంచి యటకు వచ్చెనని రాజుతో గొండెములుబలుక, సత్యాసత్యములను విమర్శింపక రాజు సచివుని కారాగృహమున ద్రోయించెను. అప్పటికి గర్భవతియై యున్న సచివభార్యయగు వీరబాల మహాశోకంబున మతిచెడి, యడవు లంబడి యొందేనింజని యొక నికుంజంబున జలహీనతచేఁ బడియుండెను. ఆయరణ్యవాసుల కధినాథుఁడగు ప్రచండుడనువాడు మృగయావినోద తత్పరుఁడై యటఁజరించుచుండ తత్పరిచరులలో నొక్కఁడు నికుంజంబు నంబడియున్న వీరబాలను కొండొకమృగముగా భ్రమించి, శరంబువదల నది యాతరుణివక్షంబునఁ దగిలెను. శరబాధచే వీరబాలయాక్రోశించుట నాలకించి, ప్రచండుడు తనవారి ప్రమాదంబును గుర్తించి యామెను భద్రంబుగ దనయాశ్రమముంజేర్చి యుపచర్యలొనరింపదొడఁగెను. వీర బాల తనచరిత్రమునెల్ల ప్రచండునకెఱిఁగించి యొకదినంబున, నత్యంత

సుందరమూర్తియగు నొక స్త్రీశిశువుం బ్రసవించి, వక్షమునందగిలిన శరబాధవలన వెంటనే మృతినందెను. ప్రచండుడామెమృతికి విచారించి సంస్కారాదులనుగావించి, యాముద్దుబిడ్డకు జగన్మోహినియను నామంబునిడి యల్లారుముద్దుగఁ బెంచుచుండెను.

అరణ్యంబున నేశుభముహూర్తంబున జగన్మోహినిజన్మించెనో యంతకు నాల్గుదినంబులకుపూర్వమున కాశ్మీరరాజేంద్రుని పట్టపుదేవి యొకదుర్ముహూర్తంబున నొకమగశిశువుం బ్రసవించెను. భూపాలుఁడు సుపుత్రప్రాప్తవార్త నాలకించి మహదానందభరితుండై వానికి జీమూతవాహన నామంబిడి, దైవజ్ఞులంబిలువనంపి, జాతకపరీక్షసేయింప, వారు పెదవివిఱచి—"రాజా! ఈపుత్రుఁడు తనపదునాఱవయేఁట జీవితములంబాయును. అయుర్దాయ హీనుం"డని పలికిరి. ఆవార్తనాలకించి రాజేంద్రుఁడు, మిగులదుఃఖించెను. అప్పట్టున మాండవ్యమహర్షి యటకరుదెంచి, "రాజా! నీవు దుఃఖింపకుము; సాగరంబున నొక మత్స్యము యొక్కగర్భంబున నొకముక్తాహారముగలదు. ఆహారమును నీవు సేకరింపగల్గుదువేని, దాని నీబాలుఁడు ధరించినచో మృత్యువును జయింపఁగలఁడు. కాని దాని, నితరులు ధరించిరేని యాతఁడు మృతి నొందును. చతురులగు జాలరుల నంపి యశేషంబులగు సాగరమత్స్యంబులంబట్టి తెప్పింపుము. వానిలో నొకానొక జలచర గర్భంబున నది లభియించు"నని యుపదేశించి చనియెను. ఈవార్తపురమెల్ల వ్యాపించెను. అట్టిచేపం గొనివచ్చినవాని కపారంబగు బహూకృతి గావింపఁబడునని ప్రకటితం బయ్యెను. రాష్ట్రనివాసులగు జాలరులెల్లరుం దమతమ యదృష్టగణనంబొనరించుకొనుచు సాగరాభిముఖులై చనిరి. చిన్నరాణియగు విపుల తొలుత రాజకుమారుఁ డల్పాయుష్కుఁడని విని యానందించెనే కాని ముక్తాహారవార్తచే నామె యాశాభంగమునొంది చేపలంగోసి పరీక్షింప నియమింపఁబడిన, వంటవానినిలోఁబరచుకొని, "యోరీ! ఆ ముక్తాహారము మత్స్యగర్భంబున లభించునేని దానిందొలుత రాజున

కొసంగక నాకిమ్ము—అందులకుమాఱుగ నేను మఱియొకహారంబును నీకిచ్చెదను. దానిని రాజున కిమ్ము—నీవీ యుపకృతిగావింతువేని నీకు సంతృప్తికరంబగు బహుమానం బొనరింతు" ననివలుక వాఁడందుల కనుమతించెను.

జీమూతవాహనుండీలోన, శుక్లపక్ష క్షపాకరుని చందమున ప్రతి దిన ప్రవర్ధమానుఁడగుచు, చతురులగు నుపాధ్యాయుల మూలంబున సమస్త విద్యారహస్యంబుల నెఱుంగుచు కన్నవారికిం గన్నవారికిం గూడ గన్నులపండువ సేయుచుండెను. అంత నొక్కదినంబున, మాండవ్య మహర్షి యటకరుదెంచి రాజుచేఁ బూజితుఁడై, కుమారుని గుణరూప శీల సంపదలకెంతయు నాశ్చర్యపడి, యాబాలు నేకాంతమునఁజేరి చిరంజీవి వగుమని యాశీర్వదించి—"వత్సా! ఇట్టిసద్గుణాలంకారుని నిన్ను సృజిం చిన పరమేశ్వరుఁడు ని న్నాయుర్దాయహీనునిగా నెన్నఁడుం గావింపఁడు. అమత్స్యము లభించును. తద్గర్భాంతర్గతాఱరహారమున నీవు చిరంజీవి వగు దువు. నీకు మహాసురమునీంద్రుల కలభ్యంబగు నిరాకార తత్త్వరహ స్యంబు నెఱిఁగింతు నాకర్ణింపు" మని యుపదేశించెను.

అనిమెఱిఁగింప నింద్రనందనుం డాశ్చర్యపడి, "బావా! ఆయనం తరము జీమూతవాహనుని చరిత్రంబేమయ్యె నెఱింగింపు" మనవుడు ముకుందుఁడిట్లనియె— "విజయా! ఆకర్ణింపుము. అట్లు జీమూతవాహ నునకు నిరాకారప్రభావంబు నెఱింగించి మాండవ్యుఁడు నిజాశ్రమంబున కరిగె—నీకథ యిటులుండ, నటరాజేంద్ర కనిష్ఠదారయగు విపులాదేవి, మంత్రియగు చారుదత్తునిపైఁగల, నిర్భరమోహంబుపెంపున నాతఁడు నిర్బంధింపఁబడియుండిన కారాగారమునుండి— తనశయనాగారంబున కొక రహస్య భూబిలంబేర్పఱచుకొని, ప్రతిదినంబును రాత్రివేళలఁ దత్కా రాగృహంబున కరుదెంచి, చారుదత్తునివశపఱచుకొన విశ్వప్రయత్నంబు లొనరించియు విఫలమనోరథ యగుచుండెను. మాండవ్యుఁడీ రహస్యం బును, యోగదృష్టినెఱింగి, విపులగుట్టు బట్టబయలుసేయు నుపా

యం బాలోచించి, ఆటవికనాయకుండగు ప్రచండునికడ కరిగి యాతనిచేఁ బూజింపఁబడి, కాశ్మీరరాజ్యమునందలి వృత్తాంతములను విపులయొనర్చుచుండిన నిగూఢ దుష్కృత్యంబులనుఁ దెలిపి, "ప్రచండా! రేపటిరాత్రి నీవు నీ పరిజనులతో నొరులెఱుంగనిరీతి చారుదత్తుని కారాగృహంబున వేచియుండి, యటకు విపులవచ్చినంతనే యాకులటనుబట్టి బంధింపుము. ఇంతలో నే నన్యమార్గంబున రాజు నటకుగొనివచ్చి రహస్యప్రకాశంబొనరింతు"నని పలికి యాతనిచే నట్లనిపించుకొని చనియెను. ప్రచండుఁడును దనప్రయత్నము నందుండెను. నిరంతరాటవీ నివాసంబునకు రోసిన జగన్మోహిని యాదినంబుననే నాగరికలోకసందర్శనకుతూహలాయత్తచిత్తయై—కాశ్మీరదేశరాజధానియగు శ్రీనగరంబునకరిగి, యందందుగల చిత్రంబులం గాంచుచు, నప్రయత్నంబుగ, రాజోద్యానంబున కరిగెను. అంతకుఁ గొంతకాలమునకుఁ బూర్వ మటకు వాహ్యాళికై యరుదెంచిన జీమూతవాహనుం డబ్బాలికాతిలకమును, జగన్మోహిని యారాజకుమారుని నన్యోన్యముంజూచుకొనినంతనే—అపుడపుడే యౌవనచిహ్నంబులు పొడసూపుచున్న—యుంబాలబాలికల హృదయంబుల ప్రేమాంకురము లావిర్భవించెను. అంత వారిరువురుం దమతమ మానసాభిప్రాయంబుల నొండొరులెఱింగించుకొనుచుండిరి. ఆదినంబులలో నారాజకుమారునకు పదునాఱు వత్సరంబులును నిండుచుండెను. అప్పటికి సరిగా నొకజాలరి గొనివచ్చినమత్స్యంపుటుదరంబున దివ్యకాంతిభాసురమగు నొకతారహారము లభింప దానిం గోయుటకేర్పరుపఁబడిన పరిచారకుఁడు పూర్వోక్తవాగ్దానప్రకారముగ నాహారము నతిరహస్యముగఁ గొనిపోయి విపులాదేవి కరంబుల నిడియెను. విపుల విపులానందభరిత మానసంబున దానినిధరించి, యందులకు మారుగ మఱియొక ముక్తామాలికను సబహుమానంబుగ నాపరిజనునకిచ్చి పంపెను. ఏక్షణంబున విపుల యీ హారమును ధరించెనో యప్పుడే—జగన్మోహినితో సరసప్రసంగమొనరించుచున్న జీమూతవాహనుం డటులే విగతజీవుడై ధరా

తలి నొరగెను. తద్వైపరీత్యముంగని జగన్మోహిని శోకింప నారంభి చెను. ఇంతలో చారుడుగొనివచ్చిన ముక్తాహారము గని రాజేంద్రుఁడు మహానందమున కుమారునిచే నద్దానిధరింపఁజేయు నభిలాషంబున వెద కుచు సపరివారుఁడై తత్ప్రమదోద్యానంబున, కరుదెంచెను. అప్పటికా బాలునకు షోడశవర్ష పరిసమాప్తి యైనకతంబున దన్మృతికంతగా విస్మ యమందక రాజును పరివారంబును ముక్తాహారంబు నాతనిమెడనిడిరి. ఐనను బాలుఁడు లబ్ధజీవితుఁడుగాఁడయ్యెను. ఆవైపరీత్యమునకు రాజ దంపతు లడలి దుఃఖింపసాగిరి. రాజపరివారము మృతరాజపుత్రుని సమీ పంబున శోకించుచున్న జగన్మోహినింగని సంశయించి—"రాజేంద్రా! ఈ యాటవికబాలిక యొక మాంత్రికురాలని తోఁచుచున్నది. దీనివలన నేద్దియో మోసము ఘటిల్లెను. కాకయుండిన రాజకుమారుఁడు జీవింపమి కేమికారణము? దీనింబ్రహరించిన నిజముతెలియు"నని పలికిరి. జగన్మో హిని నిజవృత్తాంతముందెలిపినను వారువిశ్వసింపక ప్రహరింప నుద్యు క్తులైయున్నతరి నయ్యెడకు—భగవానుండగు, మాండవ్యుం డరుదెంచి వారి వారించి, "రాజేంద్రా! ఈబాలిక నిరపరాధిని; ఈవిపరీతంబునకు మూలకారణం బగువ్యక్తి వేఱుగానున్నది. బాలునిభద్రముగ నొకచో నుంచి, నేటిరాత్రినీవు సశస్త్రపరివారంబుగ నావెంట నేఁ జూపుచోటికి రావలయును. అట నతిచిత్రదృశ్యముం గాంచఁగలవు; బాలునకు భీతిలే" దని పలికెను. చిరకాలప్రవర్ధితంబగు విపులాదేవి పాప మానాటితో పండిపోయెను. మాండవ్యమునీంద్రాదేశానుసారముగ చోరమార్గంబున, సశస్త్రపరివారుఁడగు ప్రచండుఁడు మున్ముందుగ కారాగృహముంజేరి యందందు పరిజనుల నిగూఢంబుగ నిలిపి తానొకచో దాగి, యుండెను. అనంతరము మాండవ్యసహచరులై రాజును పరివారమును శస్త్రసహి తంబుగ నొకచోనుండిరి. అందఱును విపులరాకకై వేచియుండ నట్ట నడురేయి, నాజారిణి భూబిలమార్గంబున, భక్ష్యభోజనాదులంగొని యటకరుదెంచి మెల్లననిద్రించు చారుదత్తుని తట్టిలేపెను. నిద్రలో నులికి

పాటున మేల్కాంచిన చారుదత్తుఁడా కామినీరూపరాక్షసిం గాంచి, యసహ్యమును భీతియుముఖంబునందోప, విపుల తనకందించు భోజ్యపదార్థంబుల పళ్లెరంబును కాలందన్ని—దూరంబుగనరిగి—"రోసీ! కులటా! నేటికి పదునారువత్సరములకు పూర్వము నన్ను కామించి నీదోషమును క్రమ్మ్రకొనుటకై తదపరాధంబును నాపైఁ ద్రోసి, సుగుణఖని యగు మహారాజుం బ్రేరేపి నన్నీ చెఱసాలం ద్రోయించి నేటివఱకును బాధించుచుంటివి. గర్భవతియగు నాభార్య యేమయ్యెనో నేనెఱుంగను. ఇంకను నన్ను వదలక దురాశబూనియుంటివి. నాజీవితమంతయు నీచెఱసాలలో వ్యర్థమైనది. నాకుటుంబము నీమూలమున నాశమైనది. వయస్సుమీరి కారాగారమున వికారాకృతిందాల్చియున్న నాపై నింకను నీకెట్టిమోహమో తోపకున్నది. నీవు వేయేండ్లు తపంబొనరించినను నేను నిన్ను కామించి రాజద్రోహినికా"నని దృఢస్వరంబునఁ బలికెను. అంత నావగలాడి యనేక విలాసచర్యల నొనరించుచు నాతనిడగ్గఱి, "మోహనాంగ నీకొఱకై నాజీవితము నంతను ధారపోయుచున్నాను. రాజకుమారుని జీవితములనుహరింప మత్స్యగర్భగతంబగుతారహారంబు నపహరించి కృత్రిమహారంబు నంపితిని. అందుచే రాజనందనుఁడు సమసెను. వృద్ధరాజు నొకలిప్తమాత్రంబున సంహరించెదను. నిన్ను రాజుం జేసి నేను రాణినయ్యెదను. నామనవి యాలింపు"మని వేఁడుకొన, చారుదత్తుఁడు దాని నీచయత్నంబుల కానందింపక బహుప్రకారముల దూషించెను. తద్దూషణముల కాగ్రహించి, విపుల తన కటారిందీసి వాని వక్షమునం బొడువఁబోయెను. ఇంతలో చాటునవేచియున్న ప్రచండాదుల రుగుదెంచి, చారుదత్తుని రక్షించి విపుల నెదిరించిరి. విపుల భయభ్రాంతయై భూ బిలమునం బడి పలాయితయగుట కుద్యుక్త యయ్యెను. కాని యామార్గమున రాజేంద్రుఁడు సపరివారుఁడై కాన్పించి "కులటా! ఎందుబోయెదవు నిలువు"మని గర్భనిర్భేద్యంబుగఁబలికెను. తనరహస్యమంతయు వెల్లడియయ్యెననిగ్రహించి, విపుల

తనచేతనున్న కటారి తోడనే యాత్మహత్య గావించుకొని మరణించెను. ఈచిత్రమేమో యెఱుంగక భ్రాంతినందియున్న చారుదత్తుని రాజు క్షమింపఁ బ్రార్థించెను. అంత మాండవ్యుఁడు ప్రచండుని రాజునకుఁ బరిచితునిగావించి, జగన్మోహిని చారుదత్తుని పుత్రికయని యాకథనంతను దెలిపి, విపుల కంఠమునంగల ముక్తాహారముంగొని చని రాజకుమారుని బ్రదికించెను. అనంతరము జగన్మోహినీ జీమూతవాహనులకుఁ గల్యాణమయ్యెను. చారుదత్తు మయూరవాహనులు వియ్యంకులైరి—మయూరవాహనుఁడు రాజ్యభారవహనవిరక్తుఁడై పుత్రునకుఁ బట్టముగట్టి తాను పుణ్యకథాగోష్ఠి దినంబులు గడుపుచుండెను. అని శ్రీకృష్ణుం డర్జునున కెఱింగించెను.

---

## తొమ్మిదవనాటిరాత్రి కథ.

యథాప్రకారముగా కుంతీనందన యశోదానందను లిరువురును మఱుసటిదినమున, పెందలకడ భోజనాది నిత్యవిధుల యథోక్తముగ నిర్వర్తించి, యమునాసైకతభూముల కరుదెంచి మందమారుతసౌఖ్యము ననుభవించుతరి, గాండీవి గరుడధ్వజు నవలోకించి—"యో పురుషోత్తమా! నీ దయారసంబున నిప్పటి కెనిమిదివేదాంతరహస్యంబులను కథారూపంబున నాకర్ణించి ధన్యుఁడనైతిని. తొమ్మిదవదియగు, "అమనస్క" ప్రభావంబును నేడెఱిఁగింపవే!"యని ప్రార్థింప, నా గోపబాలుఁడు "సవ్యసాచీ! ఇందులకు విక్రమసేనమహారాజు చరిత్రము నెఱిఁగింతు నాకర్ణింపు" మని పలికి యాతచ్చరిత్రము నిట్లు నిర్వచింపఁ దొడంగెను.

# విక్రమసేన మహారాజు కథ.

పూర్వకాలంబున అవంతీనగరముం బరిపాలించుచుండిన కీర్తిసేన మహారాజునకు విక్రమసేనుం డనుకుమారుఁడు గలిగెను. ఆ విక్రమ సేనుఁడు సమవయస్కుఁడును, సచివనందనుఁడును నగుగుణసాగరునితోఁ గలసి సకలవిద్యారహస్యంబుల నెఱింగి దినదినప్రవర్ధమానుండగుచు క్రమంబుగ సంప్రాప్తయౌవనుం డయ్యెను. అట్టియెడ నొకనాఁడు దైవి కంబుగ నబ్బాలకునకు దేశసందర్శనాపేక్ష వొడమ, నాతఁడు సహచరుం డగు, గుణసాగరునితో నాలోచించి తల్లిదండ్రులకుం జెప్పకయే నాటి రేయి మంత్రికుమారునితోఁ గలసి దేశాంతర గతుండయ్యెను. అట్లా రాజ కుమార మంత్రికుమారు లిరువురును, పాదచారులై చనిచని, తెల్లవారు నప్పటి కొకమహారణ్యమునందలి విశ్రాంతవటమూలమునకుం జేరిరి. ఆమహోన్నత వటభూజమునకు అంతముగానరాని దీర్ఘ శాఖలు రెండుమా త్రమే యుండెను. అందొకటి దక్షిణమునకును, రెండవది యుత్తరము నకునుఁ బోవుచుండెను. ఈశ్వర సృష్టియం దెన్నఁడుం గనివినని యా చిత్రముంగని, యాశాఖ లెంతదవ్వున కరుగునో గ్రహింపవలయునను బుద్ధివొడమ, నారాజకుమారుఁడు, గుణసాగరుంగని "తమ్ముఁడా! ఈ వటం బెంతయు విచిత్రముగ నున్నయది. దక్షిణశాఖను నేనును ఉత్తర శాఖను నీవును నారోహించి యీశాఖల యంతముం గనుంగొనివత్తము. నాకత్తిని దాని యొరతోపాటుగ నీచెట్టుతొఱటలో నుంచెదను. ఒరకు త్రుప్పుపట్టిన నీకును, కత్తికిఁ ద్రుప్పుపట్టిన నాకును నపాయముగల్గినట్లూ హింప నగును. తొలుతవచ్చినవారు రెండవవారికై యీవృక్షమూల మున వేచియుండునది" యని సాంకేతికం బేర్పరచి వెంటనే మంత్రికు మారు నుత్తరశాఖకంపి తాను దక్షిణశాఖం బట్టెను. రాజకుమారుఁ డా శాఖపై నెంతదూరము నడచినను, దానికొకయంతము గాన్పింపదయ్యెను. అందుల కాతఁడు మఱింత విస్మయమునొందుచు నెల్లయిన దానియంతు

కనుగొనవలయునను పట్టుదల రెట్టింప దానిం బట్టుకొని నడవసాగెను. అట్లాతఁడు పోవంబోవ నెట్టకేల కాశాఖ సముద్రమధ్యస్థంబగు నొక ద్వీపమునందలి దివ్య సౌధాగ్రమునకు బ్రాలెను. విక్రమసేనుఁడా సౌధ ముంగని వెఱఁగుపడియు, సాహసంబున శాఖావతరణం బొనరించి, సౌధముం బ్రవేశించెను. ఆసౌధము నిర్మానుష్యమై నిశ్శబ్దమై కాన్పింప నిది యేమిచిత్రమని తలంచుచు, నారాజనందనుఁడు కక్ష్యాంతరములు గడచిచన నందొక హంసతూలికాతల్పంబున సాక్షాత్కరించిన, జగన్మో హిని నానొప్పారు నొకయొప్పులకుప్ప నేత్రపర్వం బొనరించెను. రాజ కుమారుంగని యా రాకాచంద్రవదన సంభ్రమాందోళిత స్వాంతయై— దిగ్గునలేచి— "యోహో! పురుషవరేణ్యా! నీవెక్కడివాడవు? ఎం దుండి యిందువచ్చితివి? దేవమానవ దానవాదుల కగోచరం బగు నీ సౌధంబు నెట్లు ప్రవేశింపగల్గితివి? మాయమ నిను గాంచెనేని యొక్క కబళంబుగా మ్రింగివైచునుసుమా! "యని" పలుక, నాతఁడు తన చరిత్రంబు నెల్ల నాబాలిక కెఱిఁగించి, బాలా! నీ చరిత్రంబేమి? ఏకాంతముగ నీ దీవిపైఁగల సౌధమున నీవు వసింపఁ గారణమేమి? నీతల్లి యెవ్వరు? అది నన్ను మ్రింగునంతటి దౌర్జన్యమున కేమిహేతు" వని యడుగ, నాకోమలాంగి పూర్వస్మృతిచే గల్గిన దుఃఖంబున వెక్కి వెక్కి యేడ్చుచు, "మహాత్మా! నా చరిత్ర మతిదయనీయమైనది. నేను విహారదేశాధీశ్వరుని పుత్రికను; నన్ను మణిమాలయందురు. నా కైదేండ్లు నిండకమున్నే యీద్వీపమున కధికారిణియగు, నేకాక్షి యను దానవి నన్నుతస్కరించి యిందుంచినది. దాని ఫాలభాగంబున నొక్క టియే నేత్ర ముండుటవలన నేకాక్షి యనఁబరగుచున్నయది; అతిభయంకర స్వభావము గల్గినది. అది మానవులను భక్షించు స్వభావముగలరాక్షసి యయ్యును, నన్నుదయతోఁ జూచుచున్నది. కాని నాతలిదండ్రుల కెడ బాపి నన్ను దుఃఖమున ముంచినది. నాటినుండియు నేను నరముఖదర్శనం బెఱుంగక యీనిర్బంధమున నున్నదానను. నిన్నుఁగాంచినంతనే నాప్రా

ణములు లేచి వచ్చినట్లయ్యెను. కాని, ఓ సుకుమారా! జగదేకసౌంద ర్యశాలివగు నిను జూడ నాకు జాలి గల్గుచున్నది. నీవిప్పుడు భీకర శార్దూలకరాళంబున నిఱుకు కొంటివి. ఈ యేకాక్షి సామాన్యురాలు గాదు. నిన్ను గాంచి నంతనే మ్రింగివేయకమానదు. ఇందులకేది యు పాయం"బని వాపోయిన నారాజకుమారుఁడు నవ్వి "ఓ బేలా! విచా రింపకుము. నా కీరాక్షసి యొక భయకారణంబని తలంపకుము. ఇట్టిరక్క సులను వేవురనైన నఱనిమేషంబునఁ బోకార్పంగల"నని పలికెను. అతని సాహసధైర్యవచనసరణికి మెచ్చియు నా కోమలాంగి "రాజకు మారా! ఏకాక్షి రాక్షసియనిన నీవు సామాన్యదానవి యని భావించితివి. కాని యది సురాసురమానవాదుల కలవిగానిది. దానిప్రాణము లోకా నొక దీవియందలి త్రాళవృక్షముపై గల యొకచిలుక నోటియందలి బరిణ లోన భ్రమరాకృతిం దాల్చియుండును. ఈ కీలెఱింగి దానిని సంహరింప వలయు"నని పలుక, విక్రమసేనుఁడు కొండొకవడి చింతించి—"బాలా! అట్లయిన దీని నుపాయంబున సంహరించి నిన్ను రక్షింతును—ఇప్పటికినీవు నన్నే దేనియుపాయంబున నిందేదాచియుంచి యాదానవి జీవితరహస్యము నెల్లసాంగముగానెఱింగి నాకుఁజెప్పు" మనవుఁడు మణిమాల యా రాజ సుతు నొక బల్లినిగా మార్చి యెప్పటియట్లుండెను. అంతలో దెల్లవాఱు టయు, నాహారార్థమరిగిన యా నిశాచరి—భూమ్యాకాశములు బ్రద్ద లగు తెఱంగున, "నరవాసన! నరవాసన!" యని బొబ్బలు వెట్టుచు నటకు వచ్చెను. అంత మణిమాల నగుమొగముతో దాని కెదురుగాఁ జని "తల్లీ! ఎక్కడి నరవాసన వచ్చెనీకు? నేను నరజన్మమునందిన దానను గానా? నా వాసనయే వచ్చియుండును! ఇక్లేల జెంగటిల్లెద" నని పలుక నా యేకాక్షి సంతృప్తమానసయై మణిమాలం దనయుంక మునఁ గూరుచుండఁబెట్టుకొని, యతిప్రేమంబున ముద్దాడఁ దొడంగెను. అదే తరుణమని యా మదమరాళగమన—భీతినందినగతి నటించుచు— "తల్లీ! నేటి యుదయంబున నిరువురు యక్షదంపతు లాకాశమార్గంబునఁ

బోవుచు, దేవలోకమున రాక్షస సంహారమునకై యతితీవ్రప్రయత్నములు జఱుగుచున్నట్లు తమలో సంభాషించుకొనిరి. ఆ ప్రసంగమునంతను మన శుకరాజమగు శుచిముఖి యాకర్ణించి నాతోఁజెప్పినది. ఆ మాట వినిన గడియమొదలుగా నాచిత్తము నీ విషయంబున తత్తరించుచున్న యది. నీవు నన్నొంటిగ నిందువదలి రేలం దిరుగఁబోవుచుందువు. అట్టి యెడ నీ కపాయముగల్గిన నాకేదిగతి!'' యని వగవఁ దొడంగెను. ఆ పలుకులు విని యా రాత్రించరి పెద్దపెట్టున నవ్వి—''యోసి వెఱ్ఱిపిల్లా! ఇదియా నీ విచారము! నా ప్రాణములకేమియు భయములేదు. వగవ కుము; ఇచ్చటికి నూఱుయోజనముల దూరమునందు దధిసముద్ర మధ్యం బున నున్న ప్రవాళద్వీప మధ్యమున బహూన్నతరోన్నతంబగు నొక తాళ వృక్షము గలదు. దానిపై ''జ్వాలాముఖి'' యను నగు నొక శ్వేత కీరము వసించుచుండు. తత్కీరము నోటనున్న బరిణయందు నాపంచ ప్రాణములును, ఐఁదు తుమ్మెదలై యున్నవి. వానిం జంపినఁగాని, నేను మరణింపను. అవి యన్యులకు సాధ్యమగుట స్వప్నవృత్తాంతము కావున వగవం బనిలే'' దని పలికి మణిమాలతో గొంతతడవువినోద ముగఁ బ్రసంగించి యథాప్రకారంబుగ నిదురింప నరిగెను. ఆనాటి నిశాసమయంబున నేకాక్షి నుగల సంచారంబున కరుగగనే మణి మాల బల్లిని రాజపుత్రునిగామార్చి యాతనితో నిష్టేచ్ఛమదనవ్యాపార క్రియం దవిలి గంటలు నిమిషములుగా గడిపెను. ఆమహానందమునఁ బ్రొద్దుగ్రుంకవచ్చుటయు వారు మఱచిరి. అంత సూర్యాస్తమయం బగు మణిమాల తెలివిదెచ్చుకొని'' మనోరమణా! దానవి తనజీవన రహస్యంబెల్ల నాకెఱిఁగించినది. రేపటిదినమున నా ప్రియశుకరాజమగు శుచిముఖిని ప్రవాళద్వీపమునకంపి, యాబరిణందెచ్చు ప్రయత్నం బొన రింతు''నని రాక్షసిని సమయించునుపాయంబులఁ గొన్నిటినాలోచించు కొని, మరల నాతని బల్లినిగామార్చి వెనుకటిరీతి నారాక్షసివచ్చినంత నమ్మకంబునఁజరించెను. మఱునాడు, శుచిముఖి, మణిమాలకడ సెల

వంది రయంబున నంతరిక్షమార్గంబున వాయువేగమనోవేగములంబురు డించుజవంబున మూఁడుజాములకాలంబులోన, నాప్రవాళద్వీపముం జేరి, యెట్టకేలకు తత్తాళమహీజమును వృక్షాగ్రమున మాళికాసహితమై యున్న కీరమునుంబొడఁగాంచి, హృదయోత్సాహంబు రెట్టింప, ఱివ్వున దానిపై కెగసి, యంతకుమున్నే తనవెంట గొనిచనినబరిణ నందునిచి, బాంధవ్యానురాగం బుట్టిపడు తెఱంగున, “నాయల్లుఁడా! చిన్నతనం బున నెన్నడో నినుఁజూచుటయేగాని, మఱల నినుగాంచుభాగ్యం బబ్బ దయ్యె! ఎన్నినాళ్లకు నినుగంటిని! పారతంత్ర్యజీవనం బొనరించు నిర్భా గ్యుల గతులిట్టివియేకదా! ఆహా! నేఁడు నాకన్నులకఱవుదీరె”నని బిగ్గ నాలింగనం బొనరించె!—శుచిముఖమాటల కాశుకంబు విస్మయము దోఁప, తెలతెలంబోవుచు తననోటియందలి బరిణను శుచిముఖియుం చిన బరిణకడనుంచి, “అయ్యా! నీవెవ్వఁడవో నే నెఱుంగమికి లజ్జించు చున్నాను! మనబాంధవ్యంబెట్టిదియో వచించి నా కానందముంగూర్పు ము” నావుడు శుచిముఖి, “అల్లుఁడా! నీవు నాచెలియలగు మధురస్వన కుమారుండవుగావే! నిన్ను చిన్ననాటనే యీదానవి యీడుగాగొని నచ్చియుంచినది ? నీవలెనే నీతల్లియు దండ్రియు, నేనునుంగూడ, యీదాననీసహోదరుల ప్రాణరక్షణమాళికల నుక్కుటంగఱచుకొని వేర్వేఱుప్రదేశములం దున్నారము. నేను, ఏకాక్షీసహోదరియగు, రక్తాక్షి ప్రాణరక్షణమాళికంగొని శింశుమారద్వీపమునందలి తాళంబున వసించువాఁడను. నేను నీమేనమామను.నన్ను రక్తకంఠుఁడందురు. నిన్నుఁ జూచుపేరాశతో, మాళికను నోటఁగఱచుకొనియే వచ్చితి”నని పలి కెను. అంత నాశుకము శుచిముఖితో ప్రియంబునఁ గొంతకాలము భాషింప, నప్పటికితఁడవగుటయు, శుచిముఖియుపాయంబున, దాఁదెచ్చిన బరిణనటవిడచి యేకాక్షిజీవంబులుగలబరిణను నోటంగఱచుకొని, అల్లుఁడా! తడవయ్యె! పోయివచ్చెద! ఇట్లే తీఱికయైనపుడెల్ల నిన్ను జూచిపోవువాఁడ! దయయుంచు” మనవుడు నాశుకంబు తన మామ

వెడలిపోవుచున్నందులకు విచారించుచు శుచిముఖి దృక్పథము నతిక్రమించి చనినవెనుక యథాప్రకారంబున నాబరిణంగఱచుకొనియుండే యుండెను—సాయంకాలమగునప్పటికి శుచిముఖి యిల్లుసేరి యానందముతో నాబరిణను మణిమాలకొసంగి, తానొనరించిన చిత్రప్రకారంబుల నెఱింగించి ప్రమోదసాగరంబునమునిఁచెను. ఆరేయి యథాప్రకారంబుగ, నేకాక్షివిహారంబునకరుగ, రాజకుమారుం డోకమహాగ్నిజ్వాలనునిర్మించి, యాబరిణయుం భస్మంబుగావించెను. ఎందేని విహరించుచున్న యేకాక్షి శరీరంబెల్ల నగ్నిజ్వాలాపరితప్తమైపోవ, తనువున బొబ్బలెక్క—"మోసముమోస" మని చతుర్దశభువనంబులు ప్రతిధ్వనించు చాడ్పునఁగేకలు పెట్టుచు, మార్గమధ్యంబునబడి నడగొండచాడ్పున విగతప్రాణియయ్యెను. అనంతర మామణిమంజరీవిక్రమసేనులు నిజపురాభిముఖులై శుచిముఖితోడను రాత్రించరి సేకరించియుంచిన నవరత్నరాసులతోడనుంగదలి శాఖాగ్ర మాధారముంజేసికొని కొంతకాలంబునకు వృక్షమూలముంజేరి కరవాలముంబరీక్షింప దానియొఱకు త్రుప్పుపట్టియుండెను ఆసంకేతనమును గ్రహించి తన ప్రియమిత్రుండగు, గుణసాగరున కపాయంబుగల్గినట్లు నిశ్చయించి పెద్దతడవు వాపోవసాగెను. అనంతర మావిక్రమసేనుడు తన మిత్రునిజాడనరయ, నారెండవకొమ్మపైఁ బయనంబొనరింపఁదలంచియు, మాణిమాలాశుచిముఖులనేమిచేసిపోవుటకునుందోఁపనివాఁడై—యప్పటికి విశేషంబగుచున్న క్షుద్బాధం దీర్చుకొని పదంపడి కర్తవ్యం బాలోచింపఁదలంచి, యం దెందేనిజనపదంబు గలదేమోయని కొంత దూరం బరుగునంత దూరంబున నొక్క దేవాలయశిఖరంబు లోచన గోచరంబయ్యెను. అంత నాతండత్యాశతో తదాలయాభిముఖుండై చనుచుండ నొక జటావల్కలధారియగు మునీంద్రుం డాతనికి గాన్పించి, యత్యాదరంబున నెదుర్కొని "బాలకా! నీవెవ్వండవిందు కాంతాసహితుండవై తిరుగ గారణమే"మని పశ్నించె. విక్రమసేనుఁడామునికిం బ్రణమిల్లి తనయుదంతం బామూలాగ్రముగం దెలిపి,

క్షుద్బాధం దీర్చి తనకుం గర్తవ్యంబు నెఱింగింపుఁడని వేఁడుకొనెను. అంత నాజడదారి యాదంపతులం దనయాశ్రమంబునకు గొనిచని యొక్కచో విడియంజేసి, కందమూలాదులం బరితృప్తిఁజేసి—"రాజా! నీవిందు సేమముగానుండుము. రేపటిదినం బమావాస్య కావున మహా పర్వంబు; మనమిరువురమును సరోవరంబున స్నానంబాడి యల్లదే యట్ట యెదుటఁ గాన్పించు కాలభైరవాలయంబునకరిగి యద్దేవునిబూజించి వత్త"మనిపలుక నాతండును వల్లెయని యారాత్రి తదాశ్రమంబున సౌఖ్య లీలం గాలముఁబుచ్చెను. మఱునాటి వేఁకువజాముననే శుచిముఖి యారాకుమారునికడవ్రాలి, రహస్యంబుగ నాతనితో "ఆర్యా! ఈముని యొక కపటవేషధారియని తోఁచెడు; నీకొకచిత్రముం జూపెదర"మ్మని యాశ్రమంబున కనతిదూరంబుననున్న యొకవటప్రాంతంబున కాతనిం గొనిచనియెను. ఆప్రదేశమంతయు మానవాస్థి కళేబరములతోడను, కపాలములతోడను, కరడుగట్టిన నెత్తుటితోడనునిండి భయానకంబై యుండెను. ఆవటవృక్షశాఖలకుఁ గట్టఁబడిన మానవకపాలములుకొన్ని యావిక్రమసేనుంగాంచి పకపకనవ్వి— "యోనిర్భాగ్యుఁడా! నీవును మావలెనే యీకపటమునిచే కాలభైరవునకు బలియీయఁబడియెదవు! జాగ్రత్త" అనిపలికెను. విక్రమసేనుండాశ్చర్యముతో నీమునివృత్తాంతంబెట్టి దని ప్రశ్నింప, నాకపాలములు "రాజపుత్రా! వీడు భైరవపూజా దురంధరుడగు నొకకపటముని. నూర్వురు రాజకుమారులనుగాని, యొకజడదారిని బలియిచ్చినచో కాలభైరవుడు ప్రసన్నుండగునని యెఱింగి, యీదుర్మార్గుఁడిప్పటికి తొంబదితొమ్మండ్రను బలియిచ్చెను. నీవు నూఱవవాఁడవు. ఈ యమవాస్యకు నీబలితో వాని యీప్సితం బీడేరు. కావున నీవెట్లైన వానిని కాలభైరవునకు బలియిచ్చితివా నీకు ప్రసన్నుండగును హెచ్చరిక!" యని పలుక— విక్రమసేనుఁడు తదుపాయంబు నాలోచించుచు యథాప్రకారముగ నాశ్రమంబు నకు వచ్చి యెఱుంగనట్లుండెను. అంతనాకపటముని, రాకుమారు

నితోఁ గలసి సరస్సున స్నానమాడి ఫలపుష్పాదులంగొని కాలభైరవాలయంబున కరిగెను. ఆకాలభైరవుం డాలయమధ్యమున మహాభయంకరాకృతితో నుండెను. ఆతనిసమీపమున భీకరఖడ్గ మొకటి మెఱయుచుండెను. ముని విక్రమసేనుం జూచి—"రాజపుత్రా! ఇప్పుడు నీవీకాలభైరవునకు సాష్టాంగనమస్కారం బొనర్పవలసియున్న" దని పలుక—నాతండేమియు నెఱుంగని చాడ్పున, "యతీంద్రా! నేను రాజపుత్రుండనగుట నమస్కారం బొనర్చుట నెఱుంగను. తా మొక్కమారు చూపెదరేని నేనట్లే యొనర్తు" నని పలుక నాకపటముని కాలభైరవునకు సాష్టాంగప్రణామంబు సలిపెను.—అదియే తరుణమని రాజపుత్రుం డటనున్న కత్తితో వానితలద్రుంచి భైరవునకు బలియిచ్చెను—వెంటనే కాలభైరవమూర్తి యాతనికిం బ్రసన్నుఁడై "బాలకా! నీధైర్యంబునకు మెచ్చితిని! ఇంక నీకిష్టార్థ పరిపూర్తిగావించెద—తొలుత నేబోధించు, "అమనస్క" ప్రభావంబును శ్రద్ధాళుడవై యాకర్ణింపు" మని పలుక, నాతఁడద్దేవునకు నమస్కరించి సర్వము, నాకర్ణించెను.

అంతట కాలభైరవుడు, "రాజపుత్రకా! నీకిష్టములగువరంబులం గోరుకొ"మ్మని పలుక, నారాజకుమారుం డమితానందమునంది కాలభైరవునకుఁ బునఃపునఃప్రణామంబులనాచరించి యోదేవా! నీదయచే దేవతల కసాధ్యమగు నమనస్కమహాత్యము నెఱింగితి. ఇక నాకేకోరికలును లేవు. ఐనను, కపటాత్ముండగు నీమునిచే దేవరవారికి బలియీయఁబడిన రాజకుమారులనందఱం బ్రతికింపుము. ఇదియే మదీప్సితం" బని పలుక, నాదేవుండట్లే వారికి జీవప్రధానంబుసలుప నారాజపుత్రులందఱును, కాలభైరవునితోపాటుగా, విక్రమసేనునకు నమస్కరించిరి. ఆపునర్జీవితులైనవారిలో తన మిత్రుండగు, గుణసాగరుండును గాన్పింప నమితానందమున వాని కౌగిలించుకొని, యానాడే యారాజపుత్రశతకముతోడను శుచిముఖీ మణిమాలలతోడను నిజపురంబునకరిగి, తమపోబడి నెఱుంగక కృశించుచున్న తల్లిదండ్రులకు మహానందములంగూర్చి బహుకాలము రాజ్యముం బరిపాలించెను.

## పదియవనాటిరాత్రి కథ.

పదియవనాఁటి సాయంసమయమున, కేశవార్జునులు యథా ప్రకారముగా, పెందలకడ మృష్టాన్నభోజనంబు లొనరించి, యమునా సైకతస్థలంబున కరుదెంచి, మందవాతపోతంబు లానందముం గలిగింప, తాంబూలచర్వణం బొనరించుచున్న యవసరంబున నరుఁడు నారాయణుంగాంచి యిట్లనియె. "వసుదేవనందనా! యుష్మత్కృపావశంబున, ననితరలభ్యంబులగు తొమ్మిది ముక్తిమార్గంబులఁ గథారూపంబున నెఱుంగఁగల్గితి; ధన్యాత్ముఁడనైతిని—నేటిరాత్రి పదియవదియగు దర్పణము నెఱింగింపవే!"యని ప్రార్థింప నా వాసుదేవుండియ్యకొని, యిట్లు వచింపఁజొచ్చెను. "కుంతీనందనా! ధర్మపాలుండను మహారాజు చరిత్రంబు నాకర్ణించితివేని, దర్పణమహాత్మ్యంబు దెలియనగు"నని పలికి యేతచ్చరిత్రము నిట్లు వినిపింపదొడఁగెను.

# ధర్మపాలమహారాజు కథ.

పూర్వకాలమున, కీర్తిపాలుండనురాజు మహారాష్ట్రదేశముం బరిపాలించుచుండెను. ఆరాజునకు బహుకాలంబు పుత్రసంతతి లేమిం జేసి, ధర్మపత్నియగు నూర్మిళాదేవి యనుమతంబున, కాంతిమతియను బాలికను పరిణయంబాడెను. ఆవివాహలగ్నం బెట్టిదియోకాని, యనతి కాలముననే, యూర్మిళాదేవికి, ధర్మపాలుండను సుతుండును, కాంతిమతికి, వీరపాలుండను సుతుండునుం గలిగిరి. లేకలేక కలిగిన సంతతి యగుటంజేసి, యా భూమీశుం డమితానందము నంది — బీదలకు సాధువులకు నశేషదానంబులుసలిపి. పుత్రుల నల్లారుముద్దుగాఁ బెంచుచుండెను. అంత విధి వశంబున బాలుర యభివృద్ధితోపాటు, సవతికుమారుఁడగు ధర్మపాలునిపై కాంతిమతికి మాత్సర్యంబు సయితమభివృద్ధి నందజొచ్చెను. అంత నొక్కనాడు, భూకాంతుఁడు, తనతో మంతన

ము లాడు నదనెఱింగి, యాకాంతిమతి, "నాథా! మనకుమారులకు షోడశవర్షంబులు రేపటితో నిండును. తద్దినసంబున భక్ష్యభోజ్యపూజా పరికరాదులంగొని, దుర్గరక్షణియగు దుర్గామహాదేవిని బాలుఁడు పూజించివచ్చుట నాపుట్టినింటి యాచారము. ఆయాచారముప్రకారము, వీరపాలుని నేను పంపఁదలంచి యున్నదానను వానితోపాటు ధర్మపాలుం డునుసరిగినవచ్చుప్రత్యవాయమేమి?" అనిపలికెను. దేవీపూజగావించుట, సర్వజనశ్రేయోదాయకంబే కావున రాజేంద్రుం డందుల కనుమతించెను. పూజామిషంబున, ధర్మపాలు నెట్లయిన గతాసునిగా నొనరింప సంకల్పిం చిన, కాంతిమతి తన కుమారునితో రహస్యముగ, "తనయా! రేపటి దినంబున, నీవు నీయన్నతోఁగలిసి, దుర్గాపూజ కరుగవలసి యున్నది. మీరొంటరిగ నటకేగుదురు గావున, గుడిలోనికిఁ బోయినంతనే నీఖడ్గం బున ధర్మపాలుని వధియింపుము! లోకు లనుమానింపకుండ నీచేతికి రక్తపుగుడ్డను కట్టు గట్టుకొని, రాజద్రోహు లెవ్వరోవచ్చి యువరాజుపై గవసిరనియు, నేనును పోరాడితిననియు, చేతికి దెబ్బతగిలెననియు చెప్పవ లయును. ఈవిధంబునఁగాని, నీకు రాజ్యము లభింపఁజాలదు. మెలకువ గలిగి వర్తింపు"మని బోధించెను. గుణశాలియగు వీరపాలుఁడు, తల్లి బోధనలకు మనంబున నెంతయు నేవగించుకొనియు, నప్పటి కామె కే మియు మాఱుపలుకజాలక సమ్మతించినట్లునటించి, తనతల్లికి సోదరునిపైఁ గల యీర్ష్యకును రాజ్యకాంక్షకును విస్మయానహ్యములఁ బూనియుం డెను. మఱునాడు తగు పరికరంబులంగొని, సందెచీఁకటివేళ నొంటరిగ రాజకుమారులిరువురును, దేవీపూజార్థమై చనిరి.

దుర్గాదేవికి, పూజానైవేద్యాదులను, నిర్వర్తించినయనంతరమున, వీరపాలుఁడు తల్లిమాటలను స్మృతికిఁదెచ్చుకొని, భాతృవాత్సల్యంబున, ధర్మపాలుని పాదంబులంబడి, తనతల్లివచించినదెల్ల సాకల్యంబుగా నాతనికెఱింగించి, కన్నీరుగార్చుచు, ప్రియసోదరా! నాతల్లి నీపై నతి తరంబగు వైరముంబూనియున్నది. ఇప్పట్టున, నీవు నగరముననుంట,

శ్రేయస్కరముకాదు కొన్ని దినము లెండైన కాలముం గడిపితివేని,
మఱల తగుసమయంబున రాదగును. నాహితంబువిను" మనిపలుక,
నాతఁడు దూరమాలోచించి, యందుల కనుమతించి, యట్లే పురంబు
వాసి యెందేనిం జనియెను. అంతట వీరపాలుఁడు ఖడ్గంబునఁ దనచేతిని
గోసికొని, దానిపై కట్టు గట్టుకొని, త త్తరపడుచు పురంబునకరిగి, రాజ
ద్రోహులు యువరాజునుచంపి, కందకమున బారవైచిరనియు, తానెదు
రింప చేతికిఁ గాయమయ్యె ననియుఁ గల్పించిచెప్పెను. ఆఘోరవార్త
నాలకించి, యాత్మళాకీర్తిపాలురు మొదలునరికిన కదళీ తరువులగతి,
సోకనిమగ్నులై పోయిరి—మంత్రి యీవార్తను నమ్మఁజాలక, కందక
మున వెదకించెఁగాని యువరాజు కళేబరమొందునుఁ గానరాదయ్యెను.
కాంతిమతీదేవికిఁ గన్నులు చల్లనయ్యె—

ఇచ్చటివృత్తాంతంబిటులుండ, నట్లు పురంబువెల్వడి చనిన ధర్మ
పాలుం డారాత్రియెల్ల వీరపాలుఁడు తనకిచ్చి చినిన కరవాలసహాయ
మున, మహారణ్యమధ్యమునం బడి యారాత్రియెల్ల, దీర్ఘప్రయాణంబొన
రించి, తెల్లవారునప్పటికి, ఘూర్జర రాజ్యముం జొచ్చి, తద్రాజధానిం
బ్రవేశించి, యొక ధర్మసత్రంబున విడిసియుండెను. ఆకాలమున, ఘూర్జర
దేశమును, విక్రమాంకుఁ డనురాజు పరిపాలించుచుండెను. ఘూర్జరదేశా
ధిపతులకును, మహారాష్ట్ర రాజులకును, చిరకాల వైరములు ప్రబల్లొను
చుండెను. విక్రమాంకునకు, చిత్రాంగద యను, నవ వయస్కయగు పుత్రి
కారత్నము గలదు. విక్రమాంకుఁడు మానవాసాధ్యమగు, మత్స్యయం
త్రము నొకదానిని, నిర్మించి, దానిని భేదించిన వీరునకు చిత్రాంగద నిచ్చి
వివాహం బొనరించెద నని వాగ్దానముచేసెను. భూమండలమునంగల రాజ
లోకంబెల్ల బీరంబులాడుచు, నటకరుదెంచి, యసాధ్యమగు నాయంత్ర
మీనమును దర్శించి, "యోహో! దీనినిభేదింప మనుష్యమాత్రుల కలవి
యగునా? ఈరాజు మనలనందఱ నవమానింపఁదలంచి, యీతంత్రము
బన్నె " వివిధగతుల, నాక్షేపించుచు వెడలిపోయిరి. ధర్మపాలుఁడు

నెయుత, మా మత్స్యయంత్రవార్త నాకర్ణించి, దానినిభేదింప నుత్స హించి, రాజప్రాసాదమున కరిగి, యందు సాంకేతికముగానున్న గంట వాయించెను. ఘంటా నినాదమును విని, ఘూర్జరదేశ మంత్రి యటకరు దెంచి, తాను దగ్గరనుండి, ధర్మపాలున కామత్స్యయంత్రముం జూపెను. ఘంటాధ్వని వినంబడినంతనే, పురజను లనేకులందు గుములుగూడిరి. ధర్మపాలుఁ డామత్స్యయంత్రమును సర్వజన సమక్షంబున, సునాయాస ముగా భేదింప, పురవాసులందఱును, జయజయధ్వనులు నభోతలంబంట, నీతడు సురయక్షగరుడ గంధర్వాదులలో నెవ్వఁడో కాని, మానవమా త్రుండు గాఁడని ప్రశంసింపఁజొచ్చిరి. సచివుఁడారాజపుత్రుని మహా వైభవంబున, విక్రమాంకుని సన్నిధికిం గొనిపోవుచుండ, నాభూపాలుఁ డే సన్మానపురస్సరంబుగ నెదురుగావచ్చి, యాతని యిష్టమాలికాదులచే బహూకరించెను. చిత్రాంగదయు, సాలంకృతయై సౌధాగ్రమున నిలిచి, భూమి నవతరించిన, కంతుఁడో జయంతుఁడో యనుమాడ్కి, యస మానతనుద్యుతులతో వెలిగిపోవుచున్న ధర్మపాలుందిలకించి, మన్మధశరా హత మానసయై యాపుణ్యాత్ముని ప్రాణపతిగాఁ గాంచఁగల్గిన తన యదృష్టం బసామాన్యమని యుప్పొంగుచుండెను ఘూర్జరాధిపతి, ధర్మ పాలుని నిజాస్థాన మంటపంబునకుం గొనిచని యాతని సన్మానించి, పుణ్యాత్మా! నీకాపుర మేపురము? నీతల్లిదండ్రులై ధన్యులైన పుణ్య దంపతు లెవ్వరు? యుష్మన్నామధేయంబునఁ బవిత్రతఁగన్న పుణ్యాక్ష రంబు లెయ్యవి?" యని ప్రశ్నింప, నాతఁడు తమ కారాజు పూర్వవైరి యగుట నెఱుంగమిం జేసి, దాచక తన యుదంతంబెల్ల నెఱింగించెను. అంత నాయిలాపతి, తమ పూర్వ విరోధంబులను స్మృతికిఁదెచ్చుకొని, దండతాడిత మహోరగంబుగతి మండిపడి, "యోరీ! నీవు నా విరోధి కుమారుఁడవు మోసగించి, నాపుత్రికం బరిణయమాడ నిందువచ్చితివా? ఇప్పుడొంటరిగ నాచేతఁజిక్కితి వికనెందుబోవఁగలవు?—భటులారా! వీనిని బంధించి కారాగృహ నిబద్ధునిఁగావింపుఁ"డని పలుక, వెంటనే,

కొందఱు భటులు సాయుధులై యాతనిఁజుట్టుముట్టిరి. దుస్సహం బగు నా యవమానమును సహింపఁజాలక, ధర్మపాలుఁడు కాలరుద్రునిగతిఁ గరవాలమును కేల గీలించి, తన పరాక్రమంపుపెంపున తన్నుఁ గవియ వచ్చిన వారి నెల్లర జీకాకుపఱచి, యెవ్వరికిం దొఱుకక నాపురంబు నిర్గ మించి సేమంబుగ నవలంబడెను.

- అట్లు పలాయితుండై చనిన, ధర్మపాలుఁడు, మహా భయంకర మగు నొక యరణ్యంబు నంబడి పోవుచు, రతీరమణికెనయగు రూప లావణ్యములతో నొప్పారు చిత్రాంగదాపాణిగ్రహణభాగ్యముతనకొక్క తెప్పపాటుకాలంబున దప్పిపోయెఁగదాయని వగచుచు, క్షుత్పిపాసలపై భ్రాంతిసయితము మాని, యొక వృక్షమూలంబున కానుకొని మహావిచా రంబు సేయుచున్నంత నాతనికట్టెదుట, సాక్షాత్కరించిన యపరరుద్రుం డోయన నొప్పు నొక మునీంద్రుఁడు ప్రసన్నుండయ్యె. అతనింగాంచి సంభ్రమవినయంబులుదోప నానృపసూతి యాతనికి నమస్కరింపనాతఁడా బాలుని దీవించి, దివ్యజ్ఞానమున, నాతనిపూర్వవృత్తాంతము నెల్లనెఱింగి, "రాజనందనా ! పాపనిరయమగు నంగనాసంగమ లౌల్యంబున నిట్లు విచార పరీతస్వాంతుఁడవై యీ మహిష్మకోత్తమపదంబును, జెఱుచుకొన దగునా! ఊరడిల్లుము నన్ను పతంజలి యందురు. నీవు సజ్జనుండ వని నామదికిం దోఁచెగావున నీకు మానవదుర్లభంబగు, దర్పణమహా త్యంబు నెఱింగించెదను. తన్మూలమున తరింపఁగల"వని తనయాశ్ర మంబునకుఁగొనిచని, యుపదేశించెను.

అనిపలుక పార్థుఁ డాశ్చర్యపడి, "గోవిందా! అనంతర మాధర్మ పాలుని చరిత్రం బేమయ్యె నెఱిఁగింపు"మని పలుక ననంతర కథావిధానం బును ముకుందుఁ డిట్లెఱిఁగించెను.

అర్జునా! వినుము—దర్పణప్రభావమునెఱింగి ధర్మపాలుండాముని యందు మహావినయంబుగలుగ నితర ప్రపంచ సంబంధములను బరిత్య

జించి యాతని పాదసేవం జేయుచు నా యాశ్రమంబుననే యుండెను. ఇక్కడిస్థితి యిట్లుండ ఘూర్జరదేశమున మత్స్యయంత్రముం గొట్టిన ధర్మపాలుని చరిత్రము సమస్తదేశములందును వ్యాపించెను. ఆవార్త నొకదాసి యాలకించి, రహస్యంబుగఁ గాంతిమతి కెఱింగింప, నామె పెద్దతడవు యోచించి, ధర్మపాలుఁడు మరణింపలేదనియు నిందేదియో మోసము జఱిగెననియు విశ్వసించి, తన కాంతరంగికుఁడగు నొక మంత్రవేత్త కీ వృత్తాంతమెల్లఁ దెల్పి ధర్మపాలునిజంపి యాశిరస్సును నాకుఁజూపినచో, నీ కశేషంబు ధనంబు నర్పింతునని యాశపెట్టి పంపెను. ఆమాంత్రికుఁడును, బహుదేశంబులు దిఱిగి, తిఱిగి తుదకు, పతంజల్యాశ్రమంబునకువచ్చి, ధర్మపాలుం గనుంగొని యానందించి, యాతనితో కపటస్నేహంబు నటించి, సంహారోపాయము నాలోచించు చుండెను. ఇది యిట్లుండ నచట ఘూర్జరదేశంబున, రాజపుత్రికయగు చిత్రాంగద ధర్మపాలుని పైఁగల మోహంబున వ్యాధిగ్రస్తయై మరణాసన్నయయ్యెను. ఏకపుత్రికా జీవనుఁడగు, నావిక్రమార్కుఁడు చేయునదిలేక పుత్రికాప్రాణసంరక్షణార్థమై—పూర్వ వైరంబును మఱచి, మహారాష్ట్ర భూమీశుఁడగు, కీర్తిపాలునితో సమాధానపడి, "నాపుత్రికను నీకుమారుఁడగు ధర్మపాలున కిచ్చి వివాహ మొనరింతును. తరలిరావలయు" నని కబురంపెను. అప్పటికి పుత్రశోకంబున, ధర్మపాలుని తల్లియగు, ఊర్మిళాదేవి స్వర్గస్థురాలగుటంజేసి, కాంతిమతి గీచినగీటు దాటక వృద్ధరాజు చరించుచుండెను. ఘూర్జరభూపాలుని సందేశమును విని, కాంతిమతి ప్రోత్సాహమున రాజు వీరపాలుంజూపి, వీఁడే ధర్మపాలుండని పలికి మహావైభవంబునఁ దరలివచ్చుచు మధ్యమార్గంబున నొక్కచో, విడిసెను. ఆ ప్రదేశంబు మతంజల్యాశ్రమమునకు మిక్కిలి చేరువగా నుండుటయు, నారాత్రి వెన్నెల పిండారఁబోసినగతి ప్రకాశించుచుండుటయు, వీరపాలుఁడు తనతల్లి దౌష్ట్యమును పూర్వచరిత్రమును అప్పటి తన పరిణయంబును తలంచుకొనుచు, తన సోదరుఁ డెందుండెనో తెలియక యా వనం

బున నందందు వెఱ్ఱివానివలె పరిభ్రమించుచుండెను. ఆ నిశీధమున, ధర్మపాలుఁడు, సమాధినిష్టాగరిష్ఠుఁడై దర్పణమహాత్మ్యలోలుఁడై, యా పోజ్యోతులం బరబ్రహ్మవలోకనం బొనరించుచున్న తఱి నాయద నెఱింగి యాతనిం బోకార్పఁదలంచి మాంత్రికుఁడు కరవాలంబును సవరించుచుండెను. అంతలో విధివశంబున నటకువచ్చిన వీరపాలుఁడా దారుణకార్యముం దిలకించి వెనుకపాటునం జని తన కరవాలంబున నామాంత్రికుని తల నేలబడునట్లు ఖండించెను. ఆ సవ్వడికి సమాధిభంగమైన ధర్మపాలుఁడు కన్నులువిచ్చి యెదుటనున్న మాంత్రికుని ఖండితకళేబరంబును తన సోదరునిం గాంచి యాశ్చర్యానందములతో నాతనిం గౌగలించుకొని, తమ్ముఁడా! ఇందేలవచ్చితివి? ఈతఁడేల మరణించె" నని యడుగ, కొండొకవడికి వీరపాలుఁడు సోదరుని గుర్తించి, యానంద దుఃఖ పరవశుండై కన్నీరు మున్నీరుగాఁ గార్చుచు, నా మాంత్రికుని కపటవర్తనమును తన జనని తంత్రమును ఘూర్జరభూపతి ప్రయత్నమును తమ ప్రయాణమునుం దెలిపి, తండ్రికడకు రమ్మని త్వరపెట్టెను. ధర్మపాలుఁ డదియెల్ల నాలకించి కలయో నిక్కమో యని భ్రమించి, గురుని కడ సెలవుగైకొని, నిజజనకుని దర్శింప నాతఁడు మృతినందెనని తలంచిన కుమారుని పునరాగమనమునకు పెన్నిధి లభించిన పేదచందంబున నుబ్బి పలుమారులా బాలుని ముద్దుబెట్టుకొని యానందపరవశుఁడై యుండెను. గతకృత్యంబులందలచుకొని కాంతిమతి పశ్చాత్తప్తయై ధర్మపాలునిక్షమా ప్రార్థనం బొనరింప నాతఁ డామెను మన్నించెను. వారందఱును మఱు నాఁడు పతంజలి మహర్షికి నమస్కరించి సెలవుగైకొని, ఘూర్జరరాజధానికరుగ నారాజు చిత్రాంగదా ధర్మపాలుర వివాహముతోపాటుగాఁ దన సోదరుని పుత్త్రికయగు నీలాంగదను వీరపాలున కిచ్చి రెండు వివాహంబులును ఏకముహూర్తంబున మహావైభవంబున నొనగించెను. ప్రియజనని లేకపోయెనను కొఱంతదక్క మఱియే విచారంబును లేక దర్పణ ప్రభావ సంపన్నుఁడై ధర్మపాలుఁడు చిరకాలము చిత్రాంగదతోఁ గూడి మహారాష్ట్ర రాజ్యముం బాలించి సుఖంబుగా నుండెను.

## పదునొకండవనాటి రాత్రికథ.

అనుదినాభ్యాస ప్రకారంబున, పదునొకండవనాటి సాయంసమయమునఁగూడ యమునాతీరమున నాసీనుడై నరుఁడు నారాయణుం దిలకించి, పదునొకండవ వేదాంతమార్గమగు ఎఱుక నెఱుకఁ జేయుమని వేడ మాధవుం డిట్లుపక్రాణించెను.

# రాజశేఖరమహారాజుకథ

పాండురాజకుమార! సనాతనకాలంబున, కాశ్మీరదేశంబున, దిలీపభూపతికి రాజశేఖరుండను కుమారుఁడును, రాజముఖియను పుత్రికయు నుండిరి. దిలీపభూపతి, పుత్రునకు చతుష్షష్ఠికళలను, చతుర్వేదములను, అష్టాదశవిద్యలను, సాముగరిడీలను మున్నగు వానినెల్ల చతురులగు నుపాధ్యాయులచేఁ జెప్పించి ప్రవీణుంజేసెను. సకలవిద్యా రహస్యవేది యయ్యును రాజశేఖరుండు తన మదికి నచ్చిన కన్య లభింపమిం జేసి, యవివాహితుఁడై నిరంతర గ్రంథపారాయణ పరాయణత్వమునఁ గాలముఁ బుచ్చుచుండెను.

ఇదియిట్లుండ భూలోకసంచారముంజేసి స్వర్గమునకుఁబోవుచున్న నారద తుంబురు లిరువురును గగనమార్గమునఁ గలసికొనిరి. అన్యోన్య కుశల ప్రశ్నానంతరము నారదుఁడు తుంబురునిఁ దిలకించి, "భూలోక వార్తలే"మని ప్రశ్నింప నాతఁడు "మిత్రమా! ఏమనిచెప్పుదునుః? కాశ్మీరదేశాధిపతికి, రాజశేఖరుఁడను నొక కుమారుఁడు గలఁడు, వానిని సౌందర్యమున కంతు వసంత జయంతాదులైన గెలువఁజాలరు. ఇంతకన్న విశేషముగలదా?" యని పలుక, నారదుఁడు పెదవి విఱచి "ఆసౌందర్యమునే ఘనముగాఁ బొగడుచుంటివి. నేపాళదేశాధిపతియగు ననంగసేనునకు, అనంగసేన యను పుత్రికగలదు. దానిసౌందర్యముం

జూచిన నీ వింక నెంతగా స్తుతించుచుంటివో—దానికి సతియు రతియు భారతియు నీడుగారని" పలుక, నావిషయంబున నారద తుంబురులకు పెద్దవాదము జఱిగెను. తుదకు వారా యనంగసేనా రాజశేఖరుల నొక్కచోఁజేర్చి యందమున నధికులెవ్వరో నిర్ణయింతమని యట్లుస్థిర పఱచుకొనిరి. ఆరాత్రి రాజశేఖరుఁడు నిద్రించుచుండ మచ్చుమందు జల్లి యాతని నభోతలంబునఁ గొనిపోయి— నిద్రాముద్రితయైయున్న యనంగసేన శయ్యపైఁ బరుండఁబెట్టిరి. కొంతరాత్రి కయ్యనంగసేన, నిద్రమేల్కొని తనప్రక్క నొక మన్మథప్రతిమానుఁడగు రాజపుత్రుఁ డుంటకక్కజమంది, తనవ్రేలియుంగరము నతనికిడి, యతనివ్రేలి యుంగ రముం దనచేత ధరించి యంతలో నారద తుంబురులు కల్పించిన నిద్రచే మై మఱచెను. తరువాత, రాజశేఖరుఁడు మేల్కొని, యాసతి యెవ్వరో యెఱుంగక మోహపరవశుఁడై ముద్దిడుకొనుచుండగనే నారద తుంబురు లాతనికి నిద్రంగల్పించి కాశ్మీరరాజాంతఃపురమున నతని శయ్యంజేర్చి రాజపుత్రిక యధికసౌందర్యవతియని నారదుఁడును రాజపుత్రుఁడధిక సౌందర్యవంతుఁడని తుంబురుఁడును వాదించుకొనుచుఁ దమతమ మార్గ ములం బోయిరి. ఉదయమునలేచి రాజకుమారుఁడు గతరాత్రి తాను గాంచినదెల్ల నొక కలయని భావించి వ్రేలికిం దన ముద్రాంగుళీయము లేకుండుటయు, నా రాజపుత్రిక నామాక్షరములుగల రత్నాంగుళీయక ముండుటయుం గాంచి పరమవిస్మయ పరీతస్వాంతుఁడై యావృ త్తాంతమెల్లఁ దన సోదరియగు రాజముఖికింజెప్ప, తొలుత నామెయు విశ్వసింపక, యంగుళీయముంగాంచి తుదకు నమ్మెను.

ఆక్షణము మొదలు రాజకుమారుఁడతిబేలతనంబున వాపోవుచు, నాయనంగసేన సంగతిం గననినాడు—ముక్తజీవి నయ్యెదనని పలుకఁ జొచ్చెను. ఆయనంగసేన యేదేశపు రాజపుత్రికయో ఎందుండునో యెఱుంగక రాజముఖి—యీవార్త రాజేంద్రున కెఱిఁగించెను. దిలీప భూపతియు—బహుకాలమునకు, నిజనందనుని మానసము, కల్యాణ

సుముఖమగుటకానందమునంది, అనంగసేనయును నాస్వప్నగతరాజకుమారి యేభూదారుని కుమారియో తెలియమిం జేసి, భూమండలమండితులగు సకల మహీరమణుల పుత్రికాప్రతిబింబ చిత్రముల సేకరింప, చారుల నలుదిశలకును బంపెను—

ఇట—రాజశేఖరుఁడు బలెనే, యట—ననంగసేనయు, మఱు నటిదినంబునఁ దన వ్యధను, చెలుల కెఱింగించుచు, రాజశేఖరుని యంగుళీయకముం జూపి, యతనిం దక్క వేఱుపురుషుం జేపట్టనోపనని దృఢతర ప్రతిజ్ఞా బద్ధయైయుండెను. దిలీపునట్లె—నేపాళ భూపాలుఁడగు ననంగ సేనుఁడును, నిజకుమారికాభిప్రాయంబు నెఱింగి, సకల భూనాధకుమార ప్రతిబింబములం గొనితేర, సమర్థులగు చారులనంపెను—కొన్ని దినంబుల కావల, సంపాదిత సర్వరాట్పుత్రికాపటంబులను దిలకించి, యందుగల—యనంగసేనపటంబునేరి, యిదియే నాహృదయేశ్వరియని నిరూపించి, రాజశేఖరుండద్దానిం దన జనకుని ప్రమోాలకంపెను. దిలీపభూపతి యాపటముం దిలకించి, యద్దాని రెండవ వైపున వ్రాయబడిన వృత్తాంత మువలన, నాసుందరి, తనకు గర్భవిరోధియగు నేపాళ భూపాలునందనగా నెఱింగి, మహాగ్రహాపరవశుండై—తనయుని జీరి, కాశ్మీర నేపాల భూపతులకు తర తరంబు లాదిగాఁగల్గు బలవద్విరోధ వృత్తాంతమును విశదీకరించి, యాసుందరిపైఁగల డెందంబును మగలించుకొని వేఱొక రాకుమారిం గోరుకొమ్మని బోధించెను. రాజశేఖరుఁడు, తండ్రి మాట కెదురాడఁజాలకయు, అనంగసేనను మఱువఁజాలకయు, ఆందోళిత స్వాంతుఁడై యుండెను.

అట—నేపాళదేశాధీశ్వరుండును, చారులచే సేకరింపఁబడిన సమస్తరాజపుత్రుల చిత్రపటంబులను తన పుత్రికయగు ననంగసేనకడ కంప—నామెలనాగయు, నందలి రాజశేఖరుని చిత్రంబునేరి నిరూపించి, యాతఁడే తన వరుండనియు, నతనింగాక యన్యునివరింపఁజాలననియును, నొక్కి వక్కాణించెను. అనంగసేనుఁ డాపటము తన శత్రురాజన్యుని

కుమారునిదిగా నెఱింగి, యాగ్రహించి, వాఁడుదక్క మఱియొకని నెవ్వనినేని వరింపక తప్పదని, కూతున కసమ్మతంబుగా స్వయంవరమును సాటింపఁబంచి, రాజశేఖరు ననమానింపనెంచి, యాతని యాకృతి ననుకరించు నొక కృత్రిమవిగ్రహమును నిర్మించి, రాజకుమారుల యాస నంబులకు చివర భాగంబున ద్వారపాలకునిగా నేర్పరచియుంచెను. అనంగసేనా స్వయంవరవార్త కర్ణాకర్ణిని, రాజశేఖరుని చెవిసోకిన నతండు ప్రచ్ఛన్నవేషంబున, నేపాళరాజ్యమున కరుదెంచుచు, మార్గమధ్యంబున నొక్కచో బహు విశాల శాఖాయుతంబగు నొక వటవృక్ష ఛాయా తలంబునఁ బరుండెను. మార్గశ్రమంబున నాతఁడు గాఢనిద్రావశుండై యున్నతరి—నర్ధరాత్రంబున, నాకాశతలమునుండి, యొక యచ్చరకన్య, భువిని విహరింప డిగ్గి—యాసుకుమారుని రూపలావణ్యాతిశయములం గని యాశ్చర్యపడి, మదనవికారంబునఁ బారవశ్యతనంది, యాతని కంచుకాంతరంబునఁ గల యనంగసేనాచిత్రపటంబునుగాంచి, యందలి రూపము మూఁడుమూర్తులఁ దన్ననుకరించి యున్నందులకు మఱింత యాశ్చర్యపడి, యనంగసేనా స్వయంవరాహ్వాన పత్రికను గని, యాతఁ డటకుఁజన నున్నాఁడని గ్రహించి, యెటులైన నాతని పాణిగ్రహించు వెఱవాలోచించుచు, నంతలో తెల్లవాఱుటం దిలకించి తన మార్గం బున, నరిగెను. రాజకుమారుఁడును తదనంతరము నిద్రమేల్కని గత నిశీథంబున జఱిగిన విషయంబుల నెఱుంగక, మరలఁ దన పయనము సాగించి కాశ్మీరదేశాభి ముఖుండయ్యె.

స్వాభిలాషమునకు వ్యతిరిక్తముగ, తన తండ్రి స్వయంవరమును సాటఁబంచుటం దలంచి స్వయంవర పూర్వరాత్రంబున, ననంగసేన, నిద్దుర లేక పరితపించుచు, ఆత్మహత్యా ప్రయత్నమునకు సయితము తెగించి యుండెను. మఱునాటి స్వయంవరో శుభకార్యంబునకు భూమండలంబునఁ గల యశేష రాజకుమార శేఖరులచేతను, నేలయీనిన చందమున నిండి పోయిన ప్రేక్షకసమూహములతోడను, స్వయంవరమంటపము క్రిక్కిఱిసి

యుండెను. శుభలగ్న సమయంబున చేటికాద్వితీయయై భువి నవతరించిన, రతీసతివలెను—నిష్కళంక శశిబింబంబువదువునను, అచంచల విద్యుద్వల్లికరీతిని, రాజపుత్రుల కన్నులు మిఱుమిట్లుగొన్న—ననంగసేన సభామధ్యంబున కరుదెంచి, తన సఖివర్ణించుచుండిన, తత్తద్రాజపుత్రకుల చరిత్రంబుల నాలకించియు—ననమ్మతిం జూపుచు, తన మనోహరుండటం గాన్పింపమి, దిగులుజెంది—విగ్రహరూపంబున నున్న రాజశేఖరరూపముం దిలకించి, మహాప్రమోద పులకితాంగయై—తద్విగ్రహ కంఠభాగముం బుష్పమాలికచే నలంకరించెను. ఆ విపరీతకార్యముం గని, యనంగసేనుం డాగ్రహించె—రాజపుత్రకులెల్లరుం దమ్ము నేపాళ భూపాలుం డవమానించెనని కత్తులుదూసిరి. ఎట్టకేలకా రాజు, సమస్త రాజులం బ్రార్థించి శాంతచిత్తులంజేసి, తన పుత్రిక యొనరించిన యవివేక కార్యంబున కేమిసేయుటకుం దోపక, ఆ యబలను ప్రబల నిర్బంధమున నుంచెను. ఇట వృత్తాంత మిట్లుండ, నటరాజశేఖరుండు మార్గశ్రాంతిచే, స్వయంవర దినమునకు చేరంజాలక, జఱిగిన విషాద వార్తాదికములను మార్గమధ్యమునందే యాకర్ణించి, విరక్తుండై మరల నొక యరణ్యంబునం బడి, యెట్టకేలకు, వసిష్ఠమహాముని యాశ్రమమునం బ్రవేశించి యా ఋషిపుంగవునకు నమస్కరించి, తన వృత్తాంత మాసాంతముగ విన్నవించి తన కెద్దియేని తరణోపాయము నెఱింగింపుమని, ప్రార్థించెను. అంత నా ఋషిచంద్రుం డాతని నాదరించి ప్రీతితో నాసీనుంజేసి, "రాజపుత్రా! మహాయోగిసత్తముల కలభ్యమగు ఎఱుకప్రభావంబున నీవు తరింపంగలవు! దాని నాకర్ణింపుమని, తత్ప్రభావంబెల్ల నెఱింగించెను.

రాజశేఖరుం డెఱుక ప్రభావమున దివ్యజ్ఞానముం దెలిసినవాడై యా మునీంద్రు నుపచరించుచుం గొన్నిదినంబులందే యుండెను. ఒక దినమున రాజశేఖరుండు నదీతీరంబునకరిగి జపతప సంధ్యాద్యనుష్ఠానాదులం దీర్చుకొని గురుదర్శనంబునకు పర్ణశాలకు వచ్చుసరికి, జపపరతంత్రుండై యున్న గురుని సమీపంబున పదునాఱేండ్ల ప్రాయముగల,

విూసమురాని యొక నూతన బాలయతి, వినయముతో నాసీనుఁడై యుంట గాన్పించెను. ఆబాలుఁడు త్రిలోకమోహన సౌందర్యశాలియై చక్రవర్తి కుమారునిబోలె నొప్పారుచుండియు, జలధరాచ్ఛాదితంబగు శశిబింబముకైవడి కాషాయ చేలంబులఁ దాల్చియుండుటం గాంచి రాజశేఖరుఁడు పరమాశ్చర్య భరితుఁడై, ఱెప్పవ్రాల్పక, తనివిదీర వానినే చూచుచు నిలువఁబడు నంతలో వసిష్ఠమహర్షి జపంబు చాలించి, రాజశేఖరుంగాంచి, "పుత్రకా! ఈబాలయతి, మన్మిత్రుఁడగు నొక మహర్షికి ప్రియశిష్యుఁడు. కొండొక కార్యార్థమై నాకడ కంపఁ బడినందున, నిందు కొన్నినాళ్లు వసింపఁగలవాఁడు. నీకితఁడు ప్రియసహచరుఁడై మెలంగు" ననిపలికి యాబాలు నప్పగించెను. ఏమి కతంబుననోకాని, రాజశేఖరున కాబాలకుం గాంచినది మొదలొక యవ్యాజప్రేమ యుద్భవించి యాతని నొక యఱనిముసమైన నెడ బాయక మిగుల సౌహార్ద్రంబున మెలంగుచుండెను. ఇదియిట్లుండ, నట—కాశ్మీరదేశంబున దిలీపభూపతి యామఱునాడు, తన కుమారుం గానక విచారాక్రాంత స్వాంతుఁడై చతురులగు దూతల చతుర్దిశలకును వెదుకఁ బుత్తెంచెను. కాని, యంతం దృప్తిగాంచక రాజశేఖరు సోదరి యగు రాజముఖియు సోదరు నన్వేషింపఁ బురుషాకృతిందాల్చి, తండ్రి సెలవునంది బయలువెడలెను.

అట్లు వెడలిన రాజముఖ—తన సోదరున కనంగసేనపై కామంబు గల్గి యుండుటంజేసి, నేపాలరాజ్యంబునకే యరిగి యుండునను విశ్వాసంబున నటకరిగి పురోద్యానంబున నాసీనయయ్యె. ఆమె పురుషవేషమున నుండుటంజేసియు—అచ్చంబుగా రాజశేఖరుంబోలి యుండుటంజేసి యు, రాజభటులామెంగాంచి, తమ శత్రురాజు కుమారుండగు రాజ శేఖరుఁడుగాఁదలంచి, యామెను బంధించి, యవ్వార్తను రాజున కెఱిఁ గించిరి. అనంగసేనుఁడు, స్వయంవరంబున కుమార్తెను నిర్బంధించిన యనంతరమున, ఆమె తన కేకపుత్రికయగుటచేత—బాధింపనొల్లక

పశ్చాత్తప్తుఁడై—యనంగసేనను చేరంజీరి, "బిడ్డా! నీవు నాకేకపుత్రికవు. నాకా పురుషసంతతిలేదు. నీవా శత్రురాజు కుమారుంగోరితివి. కావున నాగ్రహించి నిన్ను కష్టపెట్టితిని ఇప్పు డారాజశేఖరుండెందైన లభించునేని నిన్నిచ్చి వివావాముచేసి, యాతని కీరాజ్యము నిచ్చి యిల్లటముగా నిందేయుంచుకొన సంకల్పించి యున్నవాఁడ"నని పలుక నామె సంతోషించెను. రాజశేఖరుఁడే మనచేతఁ జిక్కెనని భటులు వచింప రాజాతని గౌరవించి, తన సంకల్పము నెఱిఁగించి, నాకుమార్తెం బెండ్లియాడి యిందేయుండుమని కోర, రాజముఖ వారు తన్ను తన సోదరునిగా భ్రమించుచుండిరని యాత్మనెఱింగి గుట్టు బట్టబయలు సేయక, వల్లెయని యప్పటికి రాజునకు దన సమ్మతినెఱిఁగించి, రహస్యముగ దన సంగతి ననంగసేనకు మాత్రమెఱిఁగించి, వివాహముహూర్తము దూరముగఁ బెట్టించి యీలోన గూఢచారులనంపి రాజశేఖరు నుదంత మరయుచుండెను. ఒక దినంబున యక్షలోకాధీశ్వరుఁడగు చిత్రరథుని పేరోలగంబునకు నారదుండరిగి యతనిచే బూజితుండై "రాజా! నీవేల విచారముతోనున్నావు? నీకు కుశలమా?"యని ప్రశ్నింప, నతఁడు—"మునితిలకా! ఏమని చెప్పుదును. నాతనయ యగు చిత్రసేన, కొన్ని దినంబులనుండియుఁ గాన్పింపకున్నయది. ఏరక్కసులబారిఁ బడెనో యెఱుంగ; ఇదియే నావిచారమునకు హేతు"వనిపలుక, త్రిలోకసంచారియగు నాజడదారి చిఱునవ్వు నవ్వి—"యక్షరాజా! విచారింపకుము. నీతనయ, యొకనాడు భూలోకమునకరిగి యందురాజశేఖరుఁడను రాజకుమారుని వరించెను. అంతకుమున్నె రాజశేఖరుని నేపాళ భూపాలుని తనయ యగు అనంగసేన వలచియు, తన జనకుఁ డనుమతింపమిం జేసి సన్యాసివేషముం దాల్చి యడవులంబడి పోయెను. విధిచిత్రమువలన ఆ యనంగసేనయు—నీ చిత్రసేనయు నేకాకృతిఁగలవారగుటం జేసి, రాజశేఖర పాణిగ్రహణాభిలాషంబున నీపుత్రిక యితరులెఱుంగకుండ, నేపాళభూపతి యంతఃపురముం జేరెను. నిజమగు ననంగసేన దేశత్యాగిని యైనవార్త రహస్యంబగుటయు, అనంగసేనం బోలిన నీ

పుత్రిక యందుండుటయుం గని, యచటివారు చిత్రసేననే యనంగసే ననుగా దలంచుచున్నారు!—స్వయంవరమున చిత్రసేన రాజశేఖర ప్రతి మను వరింప తొలుత నాగ్రహించియు నేపాళభూపతి, యిపుడు పశ్చాత్తప్తుఁడై రాజశేఖరునకే నిన్నిచ్చెదనని అనంగసేనగా భావించి, చిత్రసేనతోఁ జెప్పెను. ఈలోన, రాజశేఖరు నన్వేషింప నాతని సోదరియగు రాజముఖి యను చిన్నది, పురుషాకృతితో నేపాళదేశమునకు రాగా, ఆమెను రాజశేఖరునిగా నెంచి రాజు అనంగసేనగా భావింపఁబడిన చిత్రసేన నాతని కిచ్చి పరిణయంబొనరింప నిశ్చయించియున్నాఁడు! రాజశేఖరుఁడు వసిష్ఠాశ్రమమున కరిగి యాతనికిఁ బ్రియశిష్యుఁడై ఎఱుక మంత్రోపదేశముం బొంది మహా మహిమను సేకరించుకొని యున్నాఁడు. విరక్తిచే నిల్లువెడలిన అనంగసేన బాలతపసివేషమున వసిష్ఠమహర్షి కంటఁ బడగా—అతఁ డామెవృత్తాంతముం దెలిసికొని, ఆమె నెట్లయిన రాజశేఖరునకు బరిణయమొనరింప నిశ్చయించి పురుషాకృతితోడనే యనంగసేనను, రాజశేఖరునకుఁ బ్రియమిత్రునిగా నేర్పరచి తన యాశ్రమంబుననే యుంచెను. యక్షేశ్వరా! ఇప్పుడు నీ తనయ అనంగసేన యను పేరం బరగుచు—నేపాళాధీశుని శుద్ధాంతమున నున్నయది" అని వృత్తాంతమెల్ల నెఱింగించి తనదారి నరిగెను.

నారదుని పలుకుల నాకర్ణించి, యక్షేశ్వరుఁడు, మితిలేని యక్షసైన్యములఁ గూర్చుకొని మహాటోపంబుమీర నరుదెంచి—నేపాళ రాజధానిని ముట్టడించెను. రాజశేఖరాన్వేషణార్థము, దిలీపభూపతిచేఁ బంపఁబడిన చారులును, రాజముఖిచేఁ బంపఁబడిన చారులును, వసిష్ఠాశ్రమ పరిసరములఁ గలసికొని, తమతమ వృత్తాంతము నొకరికొక, రెఱిఁగించుకొని, తదాశ్రమాంతరమునందే, తమ రాజకుమారుని సయిత్రము గుర్తించి—నేపాళరాజ్యంబున రాజముఖి పురుషాకృతితో నున్న తెఱంగును, యక్షరాజు నేపాళరాజధానిని ముట్టడించిన విధంబునుం దెలిపి, నేపాళరాజ్యముం గాపాడి, యనంగసేనం బాణిగ్రహణ

మాడి, రాజముఖ యజ్ఞాతవాసదీక్ష దీర్పుమని ప్రార్థించిరి. రాజశేఖరుం డందుల కనుమతించి, వసిష్ఠమహర్షి కడ సెలవు వేడుకొన నాముని నాథుఁడు రాజశేఖరుని దీవించి, ఆతనికి సమంత్రకంబులగు వివిధాస్త్ర శస్త్రంబులనొసంగి, పురుషాకృతితోనున్న అనంగసేననుగూడ తోడుగా నొసంగి నేపాళదేశంబున కంపెను. రాజశేఖరుఁడు మునిదత్తంబులగు నాయుధంబుల బలంబువలన, యక్షసైన్యంబుల దైన్యంబునొందించి, ప్రచండ సంగ్రామంబాచరింప, యక్షనాథుఁడు, దీనుఁడై సంధికిచ్చగిం చెను. తత్సమయంబునకు వసిష్ఠ నారదు లటకువచ్చి—యక్షేశ్వర రాజశేఖరులకు సంధియొనరించి, నిజవృత్తాంతముల నెల్లం దెలిపి, నిజ మగు ననంగసేనను, చిత్రసేనను రాజశేఖరునకిచ్చి వివాహం బొనరించు టేకాక, రాజముఖని యక్షేశ్వర పుత్రుఁడగు చిత్రగ్రీవునకిచ్చి—పెండ్లి చేయించి, యాదినంబు మొదలు, నేపాళ, కాశ్మీర దేశాధీశ్వరులకు మైత్రిగల్గునట్లు సమ్మతింపఁజేసిరి. రాజశేఖరుం డిరువురు భార్యలతో డను, కాశ్మీర నేపాళ భూములం బాలించుకొనుచు, నప్పుడప్పుడు యక్షలోకంబునకరిగి చెల్లెలిని బావమఱందినిఁ జూచివచ్చుచు, పుత్ర పుత్రికా లాభముఁగాంచి, బహువర్షంబులు భూతలంబున మహేంద్ర వైభవంబుల ననుభవించెను.



## పండ్రెండవనాటి రాత్రికథ

పండ్రెండవనాటిరాత్రి యథావిధంబుగా కృష్ణార్జునులు, యమునాసైకత భూములం దాసీనులై యున్నతరి, పార్థుఁడు గోపాలుం దిల కించి, పండ్రెండవదియగు, నచల పరిపూర్ణత త్త్వ ప్రభావంబు నెఱిఁగింపు మని ప్రార్థించుటయు, నానంద నందనుఁడు, పరమపవిత్రంబగు, విష్ణు

వర్ధనమహారాజు చరిత్రంబు నాకర్ణింపుమని యర్జునున కీక్రిందివిధంబునఁ జెప్పఁదొడంగెను.

# విష్ణువర్ధనమహారాజు కథ.

ఒకానొక కాలంబునఁ దొల్లి—యుజ్జయినీ నగరంబును ధర్మపాలుం డనురాజు ధర్మపాలుండై పరిపాలించుచు, బహుకాలంబునకు సావిత్రీ వరప్రసాదంబున, సావిత్రి యను కన్యాలలామముం గాంచెను. ఆ కన్యక సమస్త విద్యావిశారద యయ్యెను, వివాహంబునొల్లక, యోగినీవృత్తి దినంబులుగడుపఁ దలఁచియుండ, అందులకు తలిదండ్రులు మిగులఁ జింతించి, యొకనాఁడు, వీణావతియను నొకవేశ్యను సావిత్రి కడ కంపి శృంగార రసబంధురంబగు గానముం బాడి తచ్చిత్తవృత్తిని మరల్పుమని, నియోగించిరి. వీణావతియుఁ దన చమత్కృతియంతయుఁ దేటపడ శృంగార గీతములం బాడుటయు—సావిత్రి బిట్టలుక రెట్టింప నావీణావతింబరిభవించి దానివీణను తునియలుగా ద్రొక్కి వేసెను. అమూల్యంబును, తనకు జీవనకారణంబును నగు వీణను సావిత్రి భగ్నముచేయుటకా వీణావతి, పెద్దపెట్టున శోకించుచు రాజుతోఁ జెప్పుకొనెను. రాజు దాని నోదార్చి, యావీణకగు మూల్యంబు లిచ్చినను, అట్టివీణ తనకు లభింపదని యావెలకాంత సంతృప్తినందదయ్యెను. అనంతరము సావిత్రి తా నొనరించినపనికిఁ బశ్చాత్తాపముఁజెంది—వీణావతిం బిలిపించి, క్షమింపఁబ్రార్థించి, తన కంఠమునందలి వెల నిర్ణయింప నసాధ్యమగు నొక రత్నహారమును రహస్యముగా బహుమానమిచ్చి తనరాజ్యమును వదలి యెందేనిం బొమ్మనియెను. అంత నావీణావతి క్రమంబున ననేక దేశంబులు సంచరించుచు నెందైనఁ దన వీణవంటి వీణ లభించునేమో యని విమర్శించుచునే యుండెను. కళింగదేశాధీశ్వరుని కుమారుఁడగు విష్ణువర్ధనుండనువాఁడు మహాసౌందర్యశాలియు, రసికుఁడును, గాన

ప్రియుండును స్వయముగా వీణలం జేయువాఁడును, నని యాలకించి యటకరిగి—అతనివీణనే గైకొని తనగాననైపుణ్యంబున నాతని మెప్పించి తన చరిత్రమంతయు నాతనికెఱిఁగించి, యావీణనిమ్మని కోరినది. అతఁడు దానిని మెచ్చి యావీణనిచ్చుచు నూరక పరిహాసంబునకు, దీనికేమి వెల యిత్తువనియడుగ, నాబోటి తనకు సావిత్రియిచ్చిన రత్నహారంబు నిత్తు ననిపల్కి—వీణం గైకొని దాని నీయఁబోవ రాజకుమారుఁడు వారిం చుచు "బోటీ! క్షత్రియుఁడు తనకుఁగల్గినేని దానముసేయుటకర్జముగాని, వీణలను అమ్ముకొనుట యగౌరవము కావున నాకిదివలదు. నీవేగైకొ" మ్మని పల్కెను. కాని, యావీణావతి తొలుతనిచ్చిన దానిని మఱల గైకొన ననుమతింపదయ్యెను. తుదకాతఁడా రత్నహారమును వెలయిచ్చి కొనెను. కాని, వీణావతి సావిత్రి గుణగణంబులను వర్ణించిచెప్పినప్పటి నుండియు నాతనిహృదయ మా మదవతిపై, గాఢముగఁ దవుల్కొని యెను. అంత నొక్కదినంబున నాతఁడీ వృత్తాంతము నెవ్వరికిం దెలుపక, చిత్తస్థైర్యంబుచే యొకవారువంబునెక్కి యిల్లువదలి యరణ్యంబులం బడిపోవుచుఁ దుదకు, నారాయణుండను నొక మహర్షి యాశ్రమమునుం గాంచి, తదీయాశ్రమసందర్శనమాత్రంబున, చిత్తంబు వైరాగ్యాయత్తం బగుటయు, నామునీంద్రుని పాదంబులకెరగి మోక్షమార్గంబు నుపదే శింపుమని ప్రార్థింప, బాల్యావస్థయందున్న యారాజపుత్రుని చిత్తంబు మరల్పఁ బ్రయత్నించియు నాజడదారి విఫలమనోరథుండై—"కుమారా! అచల పరిపూర్ణతత్త్వంబు నెఱింగించెద నాకర్ణించి తన్మార్గంబునఁ దరిం పుమని యుపదేశించెను.

విష్ణువర్ధనుం డచలబ్రహ్మంబునెఱింగి, కొన్ని దినంబులటనుండ, నొకనాడు, నారాయణ మహర్షి యాతనింజీరి, కుమారా! లోకంబునఁ జతుర్విధాశ్రమంబులందును గృహస్థాశ్రమం బత్యుత్తమంబని పెద్దలు చెప్పుదురు. నీవింకను బాలుండవు గాన నీకీయాశ్రమంబీప్రాయంబున, ననుచితంబై యున్నది; నీయిచ్చవచ్చిన కన్యారత్నంబు నేరుకొని గృహా

స్థుడవై రాజ్యపాలనంబొనర్చి రాజర్షియనఁ బేరందు"మని పలుక నారాజపుత్రుండు తొల్లి తన చిత్తము సావిత్రియందు హత్తినతెరంగును, ఆబాలిక వ్రతంబునుండెలుప, నమ్మునికొండొక యుపాయంబాతనికి బోధించి, తన కడనున్న యోగిని నొకతె నాతనికీఁదోడిచ్చి పంపెను.

సావిత్రి వీణావతికి రత్నహారమును, బహుమానముగానిచ్చిన కొన్ని దినంబులకావల నొకనాడు రాజపత్నికూతుంజూడవచ్చి, రత్న హారము లేకపోవుటంగాంచి, యందులకుఁ గారణంబడిగి తెలసికొని, మహావిషాద భయాక్రాంతచిత్తయై విలపించుచు—"కుమారీ! స్వతం త్రించి ఎంతయవివేక కార్యంబొనరించితివి! ఆ హారము మనకు, కుల క్రమాగతముగావచ్చుచున్నయది. అది యెవ్వరిచేతఁబడునో వారు, ఆఱు నెలలలో నీరాజ్యముం బాలింతురని యున్నదఁట! కటకటా! నేటి కొక భోగముతొత్తు మన రాజ్యమున కధికారిణి యగునుకాఁబోలును! ఇంకేదిదారి?" యని వాపోవసాగెను. క్రమముగా రాజునకీవార్త తెలి సెను. అతం, డతిరయంబున, నావేశ్యం బట్టితెచ్చుటకు, నలుదిశలకును దూతలనంపి—పురనికటంబునఁగల శైలంబున నొక ఋషివచ్చి విడిచి యున్నాఁడనియు, నతం డాగతానాగతవేదియనియు విని, యాతని జూస్య మడుగ నటకరిగెను. యతి, యత్యంతతేజశ్శాలియై కూర్చుండి, యుండెను. రాజాతనికి నమస్కరింప నాశీర్వదించి, యతఁడు వచ్చిన సంగతిం దెలిసికొని, "రాజేంద్రా! భీతిల్లకుము! అనతికాలముననే, మాత శక్తిచే—నారత్నహారము, మీనందన కంఠమునకు వచ్చునట్లొనరింపఁ గలవార"మని పలికెను. ధర్మపాలుండమితానందమునంది, యామౌని కడ సెలవుంగొని గృహంబునకు వచ్చి యావార్తను భార్యాపుత్రికలకెఱిం గించెను. యోగులన్నను, సన్యాసులన్నను సహజముగ ప్రీతిగల సావిత్రి యావార్తవిని, యేకాంతమునఁ దన చెలియగు మంజరిం జీరి—"సఖీ! నన్ను పెండ్లియాడుమని నాతలిదండ్రులూరక వేపుకొని తినుచున్నారు. నాహృదయ మందుల కనుమతింపకయున్నది. కాంతలకు సంసారమే

మోక్షదాయకమో యోగినీవృత్తియే పరలోకసాధకమో, తోపక, నాడెందంబాందోళనమందుచున్నయది. గిరి శిఖరంబున వెలసిన ఋషి వార్త తండ్రిగారు చెప్పఁగా, నీవును వింటివిగదా! ఆయన సమర్థుడని తోఁచుచున్నది. అటకరిగి మన సందియముందీర్చుకొందమా?" యని యడుగ, నామెయు వల్లెయని యామఱునాడు వేకువజామున నటకుఁ బయనించి సావిత్రింగొనిపోయెను. గిరికందరమునఁ దొలుత వారికి యోగిని దర్శనంబిచ్చి—వారు వచ్చిన కార్యంబు నాకర్ణించి, యోగీంద్రులతో మనవి చేసినత్తునని బయటి మందిరమున వారినునిచి, తాను లోనికరిగి, కొండొకనడికి బయటకువచ్చి "రాజపుత్రీ! నీభాగ్యమసమానమైనదిసుమా! స్వాములవారు, సహజముగా, స్త్రీలనిన విరక్తులగు స్వభావముగలవారు. నాచిత్తశుద్ధి నెఱింగినవారగుట నన్నొక్కతెను మాత్రమే, శిష్యురాలిగా, నంగీకరించినారు. నన్నైనను విశేషకాలము దరినుండనీయరు. నూఱు ప్రశ్నలకొక్క యుత్తరమిచ్చుట యసాధ్యము. నీపురాకృత పుణ్యంబెట్టిదియోకాని, నీపేరు చెప్పినంతనే, వికశిత ముఖారవిందులై—నీసద్గుణసహస్రంబును,చూచినట్లే, పెద్దగాస్తుతించిరి! నీభాగ్యముపండినది నాతో రమ్మనిపలికి, యప్పుడే సావిత్రి నాయతి సన్నిధికిఁ గొనిపోయెను—ఆయతి యతిమాత్రతేజశ్శాలియై— భూమి నవతరించిన మన్మథుండోయన నొప్పారుచు—పురుషుల పేరు చెప్పిననేవ గించుకొను సావిత్రికి లజ్జావిభ్రమములం గలిగించెను. యోగి యాబాలిక ప్రణామంబులను స్వీకరించి, మెల్లన నామెచేయినెత్తి ముద్దిడి, "రాజకుమారీ! నీజనకుని రత్నహారమును మాతపశ్శక్తిచేఁ దెప్పించితిమి. ఇదే హారము! మఱియొకనాడు నీకొసంగుదముగాక!" యని యాహారము నామెకుఁజూపి, మఱలగైకొని యానాటికా బాలకు సెలవొసంగెను. రత్నహారవక్షణమున, సావిత్రీ మంజరులకా మహాత్మునియందు, దృఢవిశ్వాసము నాటుకొనెను. మఱునాడు తప్పక తమ సంశయములం, దీర్చుకొనవలయునని, వేఁగుజాముననే సావిత్రియు మంజరియు మఱల గిరిశిఖరంబునకరగి, యోగినికిఁ దమహృదయాభి

లాషము నెఱిఁగించిరి. ఆమాటలువిని యోగిని యిట్లనియెను—
"అమ్మాయీ! నాకుగల్గినసందేహమే, నీకునుఁ గల్గియున్నది. ఇటులే
నేనును కామమును త్యజించి వివాహమునొల్లక, యావిషయమై గురు
నితో వాదింపగా ఆమహాత్ముఁడు నాతో "సోదరీ! కామ మేకాంత
రూపమై జనించియున్నది. కాంతా కామముల కభేదప్రతిపత్తియైయుండ,
కాంత కామమును ద్యజించుననుట తననీడను తానుతప్పించుకొనఁగోరు
నట్లే యగును. కాంత యర్హుండగు పతిని వరించి, గృహస్థాశ్రమమున
నుండియే, ఇహపరములను రెంటిని సాధింపఁదగునని ధర్మశాస్త్రంబులు
నుడువు చున్నయవి. సంసార త్యాగినియగు కాంత సద్బుద్ధిగలద
య్యును, లోకనిందఁ జెందును. కావున సంసారిణివగు" మని బోధిం
చెను, అంతట, నేను, "స్వామీ! కామములేని కాంత, అతి కామి
యగు పురుషునితో నెట్లు సంసారసౌఖ్యముఁ జెందఁగల"దని ప్రశ్నించి
తిని. అందులకు గురుఁడు యుక్తి యుక్తముగా, "అందులకే యర్హుం
డగు పతిని గ్రహింపుమని యుపదేశించితిని. కామములేనికాంత కామ
రహితుఁడగు కాంతునే, వరింపఁ దగినది. లోకోపకారార్థము నమబోటి
యతులు కామరహితులగు సత్కాంతల ననుగ్రహించుచుందురు. తొల్లి-
యరుంధతీ వసిష్ఠులును—అనసూయాత్రిమహర్షులును, ఇట్టి యనుకూల
దాంపత్యమునే కాంచి" రని పలికెను. అందుపై—నాకు వివాహ
మాడు కోరికజనించియున్నది. గురుఁడు నాకు పితృతుల్యుఁ డగుటచే
నీయనం జేపట్టుట దోషమని యర్హుఁడగు పతికొఱకై యన్వేషించు
చున్నదానను. నీపై నీమహాత్మునకు సదభిప్రాయ మిదివరకేకలదు.
నీకును ఈయనకు నావలె—గురుశిష్యసంబంధము లేదుగావున, లోకోప
కారార్థము, నిన్నువరింప నిరాకరింపఁడు. నేనెట్లో యొప్పింతును.
నీయభిలాషముం దెలుపుమనిన, సావిత్రియొక్క మాఱుగఁదన, హృద
యమును మరల్చుకొని యేదియుం జెప్పనేరక డోలాందోళిత హృదయ
యైయుండ, మంజరియు యోగినియు బలవంతపరచి యామె నొప్పించిరి.
మూఁడవనాఁడు లోకోపకారార్థమై ఆయతి, సావిత్రిని గాంధర్వవిధిం

బరిణయమాడి, యాథరత్నహారమును మెడలో వేసెను. వివాహానంతరమున మూఁడురాత్రము లందు గడుపవలయునని యోగిని నిర్బంధింపగా, మంజరి సావిత్రి నందేవదలి తానొంటిగ నింటికరిగి, రాజపుత్రిక శరీరమున నస్వస్థతగనుండుటచే నతఃపురముననే యున్నదని బొంకి యారహస్యమును గప్పిపుచ్చెను. లోకమునందెంతటి దృఢచిత్తముఁగల కాంతయైనను పురుషసాంగత్యముచేత, అగ్నిస్పర్శతగిలిన లక్కవలె కరగకపోవదుగదా! ఆమూఁడురాత్రుల సాంగత్యమునను, సావిత్రీ యతినాథులవ్రతము లుద్యాపనచెప్పఁబడినవి. పరిపూర్ణ మదనలీలావినోదంబులం దేలుచు వారా మూఁడురాత్రులును మూఁడుగడియలుగా వెడలఁబుచ్చిరి. త్రిరాత్రానంతరమున, సావిత్రిని మంజరి యథాప్రకారంబుగ, నొరులకెఱుకపడనిరీతి సౌధాంతరమునఁ బ్రవేశింపఁజేసెను. భూనాథునకు యతినాథుఁడుచెప్పిన—జోస్యము యదార్థంబయ్యెననియును, రత్నహారమెట్లువచ్చెనోకాని, రాజపుత్రి కంఠముం జేరుకొనె ననియును, రాజ్యమునకిఁక వేశ్యాక్రాంతభీతి గల్గదనియును, పౌరులెల్లయెడలఁ జెప్పుకొనుచుండిరి. ఇంతలో, కళింగదేశాధీశ్వరుఁడు తన కుమారుఁడగు విష్ణువర్ధనునకు నీకుమార్తెయగు సావిత్రిం జేసికొన నభిలషించుచున్నారము మీయభిప్రాయమే"మని ధర్మపాలునకు వ్రాసెను. పుత్రికయభిప్రాయంబునకులోనై యామె నవివాహితనుగానుంచుట లోకాపవాదకు కారణముగ నున్నదనియును కళింగరాజు సంబంధము విడువఁదగినదిగాదనియుఁ దలంచి ధర్మపాలుఁడు సావిత్రినడుగకయే స్వతంత్రించి, వివాహమునకనుమతించితిమని ప్రత్యుత్తరమిచ్చెను. ఈలోపల సావిత్రికి గర్భచిహ్నంబులు పొడసూపుటయు, రాజదంపతులాశ్చర్య విషాదములతో నిజముఁ జెప్పుమని కూతుంగ్రుచ్చి యడిగిరి. అంతట—మంజరి, తన చెలిగాం ధర్వవిధిని యతీశ్వరుం బరిణయమాడినవార్త నెఱింగించెను. పూజనీయుఁడును మహిమాన్వితుండును నగు యతి తమకల్లుఁడయినందులకానందమొకవంకను, ఏకపుత్రికయగు సావిత్రి వైభవశూన్యుండగు సన్యాసింగూడెఁగదా యను విచారమొకవంకను బాధింప, నారాజదంప

తులు, ఎట్టకేలకు హృదయములను స్థిమితపరచుకొని, తమ దుహితకు శరీరము నందస్వస్థతగలిగియున్నది గాన వివాహమప్పటికి నిలిపితి మని కళింగరాజునకు లేఖవ్రాయించి యతినాధునికొఱకు దేశములందు వెదుక, చారులనంపెను. కాంభోపు కోడలిశరీరమున నస్వస్థతగానున్నదని విని, కళింగరాజు బాలికంజూచి మాటాడిరమ్మని యిరువురు బ్రాహ్మణులను, ఉజ్జయినీ నగరంబునకంప, వారు వచ్చి ధర్మపాలునిచేఁ పూజితులై — సావిత్రీ వృత్తాంతంబునెల్ల నతనిముఖంబున విని, "అయ్యా! మారాజ కుమారుఁడగు, విష్ణువర్ధనుండీనడుమ, వివాహంబునొల్లక, విరాగియై దేశంబులం దిరిగి తపస్సిద్ధినంది యొకపురంబున విధివశంబున ఘటితంబైన యోగంబున నొక విరాగిణి యగు రాజపుత్రికను, గాంధర్వంబునఁ బరిణయంబాడెనట! మీాతనయ కథకును, మారాజపుత్రుని కథకును సంబంధము గనఁబడుచున్నయది. ఒకవేళ మారాజసుతుఁడు పరిణయ మైనబాల మీాబాలయేయైనచో, వెదుకఁబోయిన లత కాలికిఁదగిలినట్లే యగుఁగదా!" యని పలుక, విష్ణువర్ధనుం డాశ్చర్యపడి, మీారాజకుమారు నింపురప్పింపుఁడు; ఆయతి యాతండగునో కాఁడో మేమును పోల్పఁ గలవారమని పలికెను. బ్రాహ్మణులందుల కనుమతించి, తామందే యుండి విష్ణువర్ధను నటకు రమ్మని వ్రాసిరి. ఈలోన, రాజభటులు బంధించి వీణాపతి నటకుఁగొనిరాగా నది, తనకథ పత్నిప నిపఁపుతేపని యు, దాని నిదివఱకే, కళింగరాజ పుత్రుఁడగు విష్ణువర్ధనునకు విక్రయించితినని యు నుడువ — యతియే విష్ణువర్ధనుండగుట మఱింత దృఢ మయ్యెను అనంతరము విష్ణువర్ధనుండటకు వచ్చుటతోడనే వారొండొరుల గుర్తించుకొని, సావిత్రీ విష్ణువర్ధనులకు సర్వజనప్రమోదకరముగా మరల వివాహంబొనరించి యానందించిరి. అనతికాలముననే, సావిత్రీ గర్భంబున, విష్ణువర్ధనుని ప్రతిబింబమో యన నొప్పారు చక్కని కుమారుఁడుదయించి వంశము నుద్ధరించెను. పిదప విష్ణువర్ధనుఁడు బహు వర్షములు మాళవ కళింగ రాజ్యములం బాలించి, కీర్తిగాంచె"నని

యర్జునునకు శ్రీకృష్ణుడెఱింగించి, "సవ్యసాచీ!—ద్వాదశ యోగ మహాత్మ్యంబులనెఱుంగుటచే నీజన్మము కృతార్థతనొందె" నని పలికెను—

పండ్రెండు రాజుల కథలు.

సంపూర్ణము.

---

## శ్రీకృష్ణార్జునులు—ఖాండవమును దహింపఁజేసినకథ.

పదమూఁడవనాడు కృష్ణుఁడర్జునుంజూచి—"యర్జునా! మనమీ యమునాతీరప్రాంతములందు, పండ్రెండుదినంబులు సుఖలీలలఁ బ్రొద్దులు పుచ్చితిమి! ఇందు, నేనింతకాలము కాలముగడుపుటంజేసి, నాతల్లిదండ్రులు బెంగఁగొందురు. గోపికలు పలువిధంబుల ననుమానింతురు. ఇచటి కనతిదూరమున, దేవేంద్రుని ఖాండవోద్యానముగలదు. దానిం దిలకించి, గృహాభిముఖులమగుద" మని పలికిన నతండనుమతించెను. అంత నయ్యిరువురును, ఖాండవోద్యానవనమున బ్రవేశించి యందలిరామణీయకమున కచ్చెరువందుచుండ, కంపితాంగుఁడగు నొక భూసురవృద్ధుఁడటకేతెంచి వారిపాదంబులంబడి, "మహాత్ములారా! భూమి నవతరించిన, నరనారాయణ ఋషులారా! బహుకాలమునుండి యిందు మీరాకకై వేచియుంటిని, నేటికిఁ గృతార్థుఁడనైతిని. యజ్ఞాదులయందు విప్రులు నాకమితంబుగా నర్పించిన యాజ్యంబువలన నాకు, ఉబ్బసపువ్యాధిపట్టుకొనఁ జతుర్ముఖుని దన్నివారణోపాయము నర్థించితిని. అప్పుడతండు నరనారాయణ మహర్షులు కృష్ణార్జున నామధేయంబుల నవనివెలయుచున్నవారు; వారిని శరణంబు వేడితివేని నీబాధలు నివారించును. ఖాండవోద్యానవనంబున నీవ్యాధి నుపశమింపఁ జేయగల యోషధులు

గలవు. అద్దానిని నీవు దహించితివేని స్వస్థుఁడవగుదువు. కృష్ణార్జునుల యాగమనంబును ప్రతీక్షించుచు నీవందే వేచియుండు" మని యాన తిచ్చెను. మహాత్ములారా! మీపాలఁబడితిని. నీటముంచినను—పాల ముంచినను మీదేభార"మని ప్రార్థించెను. కృష్ణుఁ డాతనిం గాంచి, సదయ శీతలవచనంబుల, "మహాత్మా! వీతిహోత్రా! నీకారణంబునఁ గదా—సమస్తదేవతలకును హవిస్సులు లభ్యంబగుచున్నయవి! ఇట్టి నీవ్యాధిమాన్ప నేనిలింపుఁడు నిన్నడ్డగించఁగలఁడు. యథేచ్ఛగా—నీవీ ఖాండవవనంబును దహింపు" మని ధైర్యమిచ్చెను. అంత అగ్నిహోత్రుఁడు మహానంద కందళితహృదయుఁడై—శ్రీకృష్ణునకు శంఖు చక్రములను, అర్జునకు శ్వేతాశ్వసంకలిత దివ్యరథంబును, గాండీవమును, అక్షయతూణీరంబులను నొసంగి మహావిశ్వరూపధారియై, యాఖాండవోద్యానమును దహింప దొరకొనెను. అంత, నాయుద్యానవనపాలకులగు భటులాయుద్ధతికి దాళఁజాలక, బిరబిరనరిగి యవ్వార్తను దేవేంద్రున కెఱింగింప, నాతఁడు బిట్టలుకవహించి, యనంతంబగు నిలింపసైన్యముతోడ, పుష్కలావర్త మేఘుంబులఁ దనవెంటనిడుకొని మహారభసంబున, నరుదెంచుచుండెను. సహస్రలోచనుని సన్నాహముంగని యర్జునుఁడు వెనుకంజవేయక, తన యక్షయతూణీరములతోడ నావనంబునకు చుట్టును భద్రంబగుకోటను నిర్మించి, యద్దానికి రెండుద్వారంబు లేర్పరచి యొక ద్వారముఖంబున ససజ్జితగాండీవియగు తానును—రెండవద్వార ముఖంబును చక్రహస్తుండగు చక్రియు నిలువ, నగ్నిహోత్రుని నిర్భయముగా దహింపుమని ధైర్యవచనంబులాడెను. దేవేంద్ర నిర్ముక్తంబులగు నాసప్త జలధరంబులును, ప్రళయకాలాట్టహాసంబు నెరపుచు, నఖండంబుగా వర్షింపుచు, నిర్ఘాతంబులనురాల్చుచు, తమసామర్థ్యమంతయుం జూపినను, అగ్నిహోత్రునిపై నొకజలబిందువైనఁబడకుండుటంగని నిర్వీర్యంబులయ్యె. సప్తమేఘుంబులట్లు పరాభూతంబులగుటంగని, గినియుచు, దేవేంద్రుఁడు దేవసేనాసహాయంబున, పార్థునితో నఖండసంగ్రామం బాచరించియు

జయింపనేరక శ్రీకృష్ణ పార్థుల మహాత్మ్యంబు నెఱింగి, శ్రీకృష్ణుం గీర్తించి—యర్జును నాలింగనముచేసికొని దీవించి—వారికిం గోరిన వరంబుల ననుగ్రహించి నిజనివాసంబునకుఁ బని వినియెను. అనంతర మాయశోదానందన కుంతీనందనులను అగ్నిహోత్రుండు పెద్దగావినుతింప వారపుడే యటనుండి కదలి యింద్రప్రస్థమున కరిగి జఱిగిన వృత్తాంత మును ధర్మరాజాదుల కెఱిఁగించి వారి నానందింపఁజేసి సుఖముగా నుండిరి.

స ం పూ ర్ణ ము.



# పతివ్రతల కథలు.

(గ్రంథకర్త:—మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు)

ఈకవీంద్రుని ద్రౌపది మున్నగు నాటకములయందలి విదురాదుల రసవత్తరగద్యముల ప్రాశస్త్యమునుగని యనేకులు వీరి ప్రత్యేక గద్యగ్రంథమును చదువ నభిలషించి-యాశ్లాఘించుటచేత దీని ముద్రింపనైనది. ఈ కవీంద్రుండు పద్యరచనయందెంత సమర్థుండో గద్యరచనమునం దంతకన్న సమర్థుండు. నాటకరచనమునందెంత సమర్థుండో కథారచనమునం దంతకన్న సమర్థుండు. బహువిధపురాణ సంశోధనముం గావించి, యీకవిచంద్రుండీ పతివ్రతాచరిత్రములను వ్రాసెను. స్థూలదృష్టిచే ఈకథలు సర్వజనులకును సామాన్యముగ తెలిసినవి వలెనే తోచునుగాని సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినచో - బహువిధయోచనమున, అనేకపురాణ పరిశోధనములవలన, అనేక చిత్రవిచిత్రాంతర్గాథలతో రచింపఁబడిన పుణ్యకథలుగా తెలియఁబడఁగలవు. సామాన్య పాఠక లోకమున కెఱుంగరాని, చిత్రచరిత్రలెన్నియో యీ పతివ్రతాచరిత్రము లందుగలవు. పేరునకు పతివ్రతా చరిత్రములేకాని, నిజమునకిది యష్టాదశ పురాణముల సారము. పాకము, శయ్యయు, ద్రాక్షారసపాకము. ఒక్కసారి చదివి పారవేయఁదగిన నిస్సారగ్రంథము గాదు. ఎన్నిసారులు పఠించినను క్రొత్తక్రొత్తరుచులుప్పతిల్లజేయుచు ప్రతిపుటను నవీనానందసంధాయకమై, కమనీయనిరుపమగద్యకావ్యరత్నమై ప్రతియింట నుండఁదగిన పవిత్రగ్రంథమైయున్నది. స్త్రీలకేకాక పురుషులకును అనర్ఘరత్నములగు విషయము లెన్నియో యిందు సేకరింపఁబడినవి. అడుగడుగునకును క్రొత్త క్రొత్తరుచులు - పదములకును క్రొత్తక్రొత్త భావములు - వాక్య వాక్యంబులకును క్రొత్తక్రొత్త విషయములు-చరిత్ర చరిత్రములకును క్రొత్త క్రొత్త నీతులు- జనించుచు వారువీరనక సకలమతములవారికి సమ్మతమయి సమస్త జనోపయుక్తమైన దివ్యసంపుటము. ఇంటింట నుండవలసిన గ్రంథము. ఇందు సతీ సావిత్రి, సక్కుబాయి, అనసూయ, ద్రౌపది యను వారి చరిత్రములు గలవు. వెల 0—8—0.

---

కురుకూరి సుబ్బారావు, సరస్వతి బుక్కుడిపో, బెజవాడ.

| క్టివు నవలలు | |
|---|---|
| జయాపజయములు | 1- 8 |
| భూతగృహము 1పా | 1- 8 |
| డిటో రెండవభాగము | 1- 8 |
| రహస్యగోపనము | 1- 8 |
| మాయావి | 1- 8 |
| మనోరమ | 1- 8 |
| మాయావిని | 0-12 |
| లక్షరూపాయలు | 0-12 |
| సమానప్రతిభ | 1- 8 |
| 264 మొదటిభాగము | 1- 8 |
| 264 రెండవభాగము | 1- 8 |
| కంకణరహస్యము | 1- 8 |
| భైరవా! ఖడ్గము! | 0-12 |
| దేవేంద్రబాబు | 0-12 |
| ఘోరప్రతిక్రియ | 1- 8 |
| భీషణప్రతిహింస | 1- 8 |
| భయంకర నారీపిశాచి | 0-12 |
| ప్రతాపదార్జన్యము | 0-12 |
| భయంకరచోరాగ్రేసర | 0-12 |
| దొంగలనాయకుడు | 0-12 |
| శక్తికుమార్ | 0-12 |
| పెనుభూతము జాగ్రత | 1- 0 |
| చోరాబహద్దూర్ | 1- 0 |
| మాయామందిరము | 1- 0 |
| ప్రతిక్రియ | 0-12 |

| డిటెక్టివు నవలలు | |
|---|---|
| బంగారు బరిణె 1 పా | 1- 0 |
| డిటో రెండవభాగము | 1- 0 |
| సుడిగాలి 1 పా | 1- 0 |
| సుడిగాలి 2 పా | 1- 0 |
| హత్యావిచారము సో॥ రా॥ | 0- 4 |
| రక్తజ్వాల మొ॥ భా॥ ,, | 0-12 |
| రక్తజ్వాల రెం॥ భా॥ ,, | 0-12 |
| గజదొంగ | 0-12 |
| ఇందిర | 1- 0 |
| వాడేవీడు | 0-12 |
| శిశుహత్య 1 పా సో॥ రా॥ | 1- 0 |
| శిశుహత్య 2 పా డిటో | 1- 0 |
| శిశుహత్య 3 పా డిటో | 1- 0 |
| పేటికాంతరశవము 1 పా | 0-12 |
| డిటో 2 పా | 0-12 |
| మంత్రగబ్బ సో॥ రా॥ మొ॥ భా॥ | 1- 0 |
| డిటో రెం॥ భా॥ ,, | 1- 0 |
| హత్యావినోది | 0-12 |
| ఘోరకలి | 0-12 |
| వసుంధర | 0-12 |
| కాలసర్పము | 1- 0 |
| వలపులరాణి | 1- 0 |
| బుగ్గిరాముడు | 0-12 |
| నీవేనా | 0-12 |
| దురాశ, ఆశాపిశాచము | 1- 0 |

